ఓం శ్రీ సాయిరామ్

ఓం శ్రీ సాయికృష్ణపరబ్రహ్మణే నమః

# శ్రీమదాంధ్ర

# భగవద్గీతాసుధామాధురి



ఓం సాయీశ్వరాయ విద్మహే సత్యదేవాయ ధీమహి
తన్నః సర్వః ప్రచోదయాత్ ॥

ఆర్షధర్మప్రచారకులైన తిరుమల తిరుపతిదేవస్థానములవారి
ఆర్థికసహాయముతో ప్రచురితమైనది.

రచయిత :
శిష్ట్లా సూర్యనారాయణమూర్తి

ప్రథమ ముద్రణము అక్టోబరు [illegible]

ప్రతులు 1000

వెల రు 18/-



ప్రతులకు :

శిష్టా సత్యవతి

W/o సూర్యనారాయణమూర్తి

రిటైర్డు తెలుగుశాఖాధ్యక్షు[illegible]

[illegible] పాయికారం

అమలాపురం. [illegible]



సర్వస్వామ్యములు రచయితవి

ముద్రణ :

శ్రీ విజయదుర్గా పవర్ ప్రెస్,

రబ్బానివిల్లి.

అమలాపురం మండలం.

ఫోన్ [illegible]

ఓం శ్రీసత్యసాయిరామ్

ఓం శ్రీ సాయికృష్ణ పరబ్రహ్మణే నమః

అంకితము

1 జయము చిన్మయ చిద్విలాసా
జయము జయము పర్తిశాంతి నిలయా
జయము శ్రీసత్యసాయీ
జయము శుభదాయీ

2 సాయికృష్ణుని పాంచజన్యజ
ముకుళ వేదాంతార్థసారము
దైవ గీతాసుధామాధురి
స్వామికంకితమూ

3 సాయి మాతృకృపావిశేషము
సాయి జనక గురూపదేశము
సాయిధ్యానము సాయియోగము
వడియు గీతాసుధామాధురి
సాయి సేవకే యంకితమ్

4 గీత జ్ఞానము గీత ధ్యేయము
సంధాతయు గీత శ్రోతయూ
అందరిగీతా సుధామాధురి
అంకితము శ్రీసాయికే

ఓం సాయిరామ్

# ఆశీస్సు

మూకం కరోతి వాచాలం
పంగుం లంఘయతే గిరిమ్
యత్కృపా తమహం వందే
పరమానంద మాధవమ్

ఆత్మసృష్టిలో విశిష్టస్థానము కలిగియుండు మానవుల పరమునందలి ఆత్మసాధనమును మరచినపుడు దయామయుడైన పరమాత్మ వివిధ రూపములలో అవతరించి వారిని సన్మార్గమున ప్రవర్తింపజేయును.

పరిత్రాణాయ సాధూనాం
వినాశాయచ దుష్కృతామ్
ధర్మసంస్థాపనార్థాయ
సంభవామి యుగేయుగే
అనిభగవానునిప్రవచనము

ద్వాపరాంతమున మానవాళి అపమార్గగాములై సృష్టి వ్యవస్థకు భంగమేర్పరచు కాలమును గమనించి వారిని చక్కదిద్దుటకు పరమాత్మ శ్రీకృష్ణభగవానుడై యవతరించెను.

అట్లవతరించిన శ్రీకృష్ణపరమాత్మ లోకానుకంపతో అర్జునుని నిమిత్తముగ చేసికొని సర్వవేదాంత సారమైన శ్రీమద్భగవద్గీతను లోకమునకు ప్రసాదించెను.

సత్యసాయి వీరి పరమదైవము. అద్వైతముపట్ల వీరి యంకితభావమును తిలకింపుడు-

సాయి మాతృకృపానురాగము
సాయి జనక గురూపదేశము
సాయి ధ్యానము సాయి యోగము
అదియె 'గీతాసుధామాధురి'

పితృభక్తిపరాయణులైన వీరు తన పితృదేవులయిన సూరమాంబా దీక్షితులకు దైవసమాన భావనతో అంజలి ఘటించిరి.

'శివ ఏవ గురుర్గరీయాన్' అని నమ్మి గురు కృపా మాధురిని చవిచూచిన వీరు పరమగురువులైన శ్రీ జటావల్లభుల పురుషోత్తముగారికి, శ్రీ వెంపరాల సూర్యనారాయణ శాస్త్రిగార్కి అనన్యభక్తిభావమునర్పించియుండిరి.

అనువాదపద్ధతి-

ఈ రచయిత అనువాద విషయమున తీసికొన్న మెళకువలు మిక్కిలి ప్రశంసనీయములు.

వీరు భగవద్గీతలోని ఏ శ్లోకమును విడువక అనువదించిరి. కొన్నిచోట్ల ఒక శ్లోకమును అవశ్యకతనుబట్టి రెండుమూడు పద్యములుగ వివరించిరి. మరికొన్ని పట్టుల అనావశ్యకతను గుర్తించి ఔచిత్యమును పాటించి ఒక పద్యములోనే యిమిడ్చిరి. మరికొన్ని తావుల విస్పష్టతను దృష్టిలోనుంచుకొని

మూలశ్లోకపదములను యథాతథము గ్రహించిరి. విషయ వైశద్య సౌలభ్యముల కీపద్ధతి యాదరణీయమనుట సువిదితము.

భగవద్గీతాసుధామాధురియును నీసుందరకృతి సర్వజనుల కాస్వాదాప్యాయితము. జీవనతరణోపాయము కావలయునన్న దీని పఠనాయనము శ్రీ సత్యసాయి కృపచే ఫలవంతము కాగలదనుట నిస్సంశయము.

"జయంతితే సుకృతినః రససిద్ధాః కవీశ్వరాః"

ఒక్కమాట-

ఒకింత సాహిత్యజ్ఞానము, రవంత శాస్త్రపరిచయము లేక అతిసామాన్యుడనైన నేనీయుద్గ్రంథమునవమీక్షించుట యన్నది మిక్కిలి పరిహాసాస్పదమైన సంగతి అయినను శ్రీ సూర్యనారాయణమూర్తిగారు మైత్రీభావమున ఏత త్కృత్యనిర్వహణమున నన్నాదేశించిరి. శ్రీసత్యసాయీ ఆదేశమే యీ మిత్రాదేశమనినమ్మి కిమ్మనక యీసాహస మొనర్చితిని. పవిత్ర గ్రంథ పఠనమహిమ, శ్రీ సత్య సాయీ కృష్ణ కృపాగరిమ నా యజ్ఞానమును దొలగించి నా యీ ప్రవృత్తిని సహృదయా దరణీయము కావించునని ఆశించుచున్నాను.

'నిమిత్తమాత్రం భవసవ్యసాచిన్' అన్న భగవద వచనము నా ఆలంబన బీజమయినది.

పవిత్ర వేదాంత విషయ పరిశీలనకు నన్ను ప్రోత్సహించి నాకొకింత యానందము పంచియిచ్చిన మిత్రవరేణ్యులు సహృదయ వరులు శ్రీ సూర్యనారాయణమూర్తి గారికి శుభాశీస్సులు.

సర్వోపనిషదో గావో
దోగ్ధా గోపాల నందనః
పార్థో వత్సః సుధీర్భోక్తా
దుగ్ధం గీతామృతం మహత్

ఆశిషమ్
ఇత్థం బుధజన విధేయః
వెం. శివబ్రహ్మశాస్త్రి



# అభినందనము.

---

**Dr. M. V. Satyanarayana** *Visakhapatnam*
**M. A. Ph. D.** **2-8-94**
**(Retd) Publication officer (Telugu)**
**11/1 Pithapuram Beach quarters**
**Andhra University**

ప్రపంచ సాహిత్యములలో అతి ప్రాచీనములైన వైదిక సంస్కృత సాహిత్యాలకు ఎంతవిశిష్టత ప్రత్యేకత కలదో, సాక్షాత్తు శ్రీకృష్ణపరమాత్మ ముఖమునుండి వెలువడి అర్జునునకు ఉపదేశింపబడిన భగవద్గీతకు అంతకంటే ఎక్కువ ఉత్తమస్థానమున్నది. ప్రపంచములో సుమారు నాగరిక భాషలన్నిటిలోకి భగవద్గీత అనువదింపబడినది.

బ్రహ్మశ్రీ శిష్టా సూర్యనారాయణమూర్తి గారు సంస్కృతాంధ్రాంగ్లభాషలలో పండితులు మరియు ఉత్తమ ఉపాధ్యాయులు. నిర్మల నిశ్చల నిగూఢమైన దైవభక్తి కలవారు. 40 సం॥ల నుండి సాహిత్య సాంస్కృతికాధ్యాత్మిక సంఘములకు కార్యనిర్వాహకులుగా నుండుటయేగాక భగవాన్ శ్రీ సత్యసాయిబాబావారికి ఆత్మార్పణము చేసి అంతరింద్రియ బాహ్యేంద్రియ శుచిత్వమును పొందిరి. 'సాయిలీలాశతకము' [1980] రచించి ప్రచురించిరి. ఆ శతకమునకు శతకవాఙ్మయమునందు ఉత్తమస్థానముకలదు

వీరిరెండవకృతి "శ్రీమదాంధ్ర భగవద్గీతా సుధామాధురి". ఈ గ్రంథమును నేను పూర్తిగా చదువుటకు శ్రీ మూర్తిగారు అవకాశముకలిగించుట, సాయి బంధు కృపగా భావించు చున్నాను.

నేను సంస్కృత భగవద్గీతలోని శ్లోకములను వీరి గ్రంధములోని గేయములను పరిశీలించితిని. వీరికృతిమూ లానుసారముగా సరళమైన తెలుగులో మాత్రాచ్ఛందస్సు లో గేయరూపమున గానయోగ్యముగా పండిత పామర హృదయరంజకముగా నున్నది ఈ కృతికర్త సంస్కృత ములోనున్న భగవద్గీతావాక్యములు ఆంధ్రాంగ్లానువాద ములు క్షుణ్ణముగా చదివి గీతామహోదధిని మథించి గీతా సుధ నాస్వాదించి ఆ గీతాసుధామాధురిని పా ఠ కు ల కు పంచిపెట్టుటవలన అతి దుర్లభమయిన మనుజ జన్మమును సార్థకము చేసికొని తాను తరించి యితరులను తరింపచేయు చున్నారు.

ఉపనిషత్సారమయిన భగవద్గీతలోని శ్లో క ము లు మంత్రమయములు అని 'గీతామకరందము' లో పేర్కొనబ డినది. గీతామృతపానము చేయుటకు నిర్మలబుద్ధితో ధైర్యముతో మనస్సును స్వాధీనము చేసికొని శబ్దాది విష యములను రాగద్వేషములను విడిచిపెట్టి ఏకాంతస్థలమందు నివసించి మితాహారమును భుజించుచు శరీర వాఙ్మనస్సు లను అరికట్టి నిరంతరము ధ్యానయోగాభ్యాసము చేయ

పైని పేర్కొనిన సంస్కృత శ్లోకములలోని విషయము మూడు గేయాలలో సులభ గ్రాహ్యముగ నున్నదని పాఠకులు గ్రహింపగలరు.

సర్వ దేవతా స్వరూపుడయిన శ్రీ సత్య సాయి భగవానుడు ఈ కృతికర్తకు ఆయురారోగ్యైశ్వర్యములు కుటుంబ క్షేమ సౌఖ్యములు బ్రహ్మజ్ఞానము ప్రసాదించి స్వదేశ విదేశములందలి భక్తుల కుపకరించు గ్రంథరాజములను రచించుటకు ప్రచురించుటకు తగిన శక్తి సామర్థ్యములనిచ్చునని నా దృఢ విశ్వాసము.

ఇట్లు
శ్రీ సత్యసాయి చరణదాసుడు
మోదేకుర్తి వెంకటసత్యనారాయణ.



శ్రీ

# "గీతా పీయూషము"

శ్రీ

## ఆస్వాదము

భగవద్గీత విశ్వమానవకళ్యాణగీత. ఆధ్యాత్మిక జగదేక మాత. వ్యావహారిక పారమార్థిక జీవితాలను సమన్వయించిన శాంతిదూత. సనాతన ధర్మావలంబులను సదా ఉత్తేజపరచు సత్య తత్త్వ సారం.

అందువలననే నాటినుంచి నేటివరకున్న సమాజంలో సకల జన హృదయ రంజనిగా అది మనగలుగుతున్నది. అందువలననే బహుభాషల వివిధ సాహిత్య ప్రక్రియలలో అది నాట్యం చేస్తున్నది.

అటువంటి సాహిత్య సంవిధానంలో ఈ "భగవద్గీతా సుధామాధురి" ఒకటి "ముత్యాలసరాలు" అన్న మాత్రా ఛందస్సులో గానయోగ్యంగా (కూర్పబడింది) కూర్చిన వారు కవి పండితులు శ్రీ [illegible] సూర్యనారాయణమూర్తి గారు. శ్రీ సాయికృష్ణ భక్తవరేణ్యులు నా సాహిత్యబంధువు డాక్టర్. పొదికట్టి సత్యనారాయణగారికి ఆధ్యాత్మిక బంధువు. కాగా నాకున్న సహృదయ బంధువైనవారు.



డా॥ సత్యనారాయణగారి

ఈ "మాధురి" ని చూసి వర్ణించినారు. "పరమాన్నము" నకు పరిచయము పొందగలుగు గీతామృతాస్వాదనము"నకు ఉపోద్ఘాత మెందుకు! వెంటనే తనివితీర ఆస్వాదించినాము. ఆనందించినాము. ఆనందాన్ని మాటలతో చెప్పలేము. అది అనుభవైక వేద్యం।

గీతామృత మాధుర్యాన్ని చక్కటి విమర్శ పద్ధతిలో పంచిపెట్టిన శ్రీ శిష్ట్లా సత్యనారాయణమూర్తిగారు ధన్యులు. వారి "అర్థములకు సర్వదా-సర్వధా" శ్రీకృష్ణుడు సమకూర్చగలడని నా విశ్వాసము-ఆకాంక్ష "సమేతం పరిత్యజ్య" "యోగక్షేమం వహామ్యహమ్" అన్నవి పరమాత్మయొక్క ప్రతిజ్ఞా వచనములుగదా! "తథాస్తు".

అప్పల్ల సోమేశ్వరశర్మ.
2-8-84





వందే వంద్యం సదానందం । దేవదేవం పరాత్పరం॥
సంతతం చింతయేనంతం । సాయిరామం దయాంబుధిం॥

ఓం శ్రీ సత్యసాయిపరబ్రహ్మణే నమః

# కృతజ్ఞతాంజలి

శ్రీ సత్యసాయీశ్వరుడు ప్రేరకుడై కారకుడై కర్తయై ఈదాసానుదాసుని అనుగ్రహించుటకు ఈ గ్రంథమును వ్రాయించినాడు. శ్రీ స్వామివారి చరణ సరోజములకు త్రికరణ శుద్ధిగా కోటికోటి సాష్టాంగ ప్రణామములు.

ఈ గ్రంథ రచనకు అర్థికసహాయ మొసగిన ధర్మప్రచారకులు తిరుమల తిరుపతి దేవస్థానాధి పతులకు కృతజ్ఞతాంజలులు.

నేను శ్రీసాయి సన్నిధి చేరుటకు ప్రేరకురాలైన డా॥ గోటేటి సరస్వతిగారు శ్రీ సాయికేశవ శతకావిష్కరణ సభలో "అందరకుబోధకమై, ఆస్తికులలోని సాత్త్విక సంస్కారమును జాగృతము చేయగలిగిన గ్రంథమును వ్రాయు" అని ఆదేశించారు. శ్రీవారే ఆమెచే ఆజ్ఞాపలికించారు. ఆ ఆదేశమే ఈ రచనకు నాంది. అమ్మకు నాకృతజ్ఞతాంజలులు.

శ్రీసాయి కేశవశతకము ప్రచురించి శ్రీసాయిభారతి రూపు దిద్దుకొనుటకు కారణమైన సాయిసోదరి డా॥ శి. భారతి గారికి ఆశీఃపూర్వక కృతజ్ఞతలు.

ఈ గ్రంథమును సుందరముగా తీర్చి దిద్దిన తమ్ము పిల్లి శ్రీ విజయదుర్గా పవర్ ప్రెస్ అధిపతి. సాంఘికోదరుల శ్రీ బుడబుడ సత్యనారాయణగారికి కృతజ్ఞతాంజలి.

వీరందరకు కరావలంబన మొసగి తత్త్వమార్గమున అభ్యుదయ పరంపరగా ముందుకు నడుపుచు సర్వదా, సర్వదా కంటికి రెప్పలా కాపాడుచుండవలసినదిగా భగవాన్ శ్రీ సత్యసాయీశ్వరుని ప్రార్థించుచున్నాను.

ఇట్లు
రచయిత.



ఓం శ్రీ సాయిరామ్

శ్రీ సత్యసాయి పరబ్రహ్మణే నమః

శ్రీ సాయికృష్ణ పరబ్రహ్మణే నమః

# శ్రీమద్భగవద్గీతా సుధామాధురి

## మొదటి అధ్యాయము — అర్జున విషాదయోగము

ధృతరాష్ట్రు డడిగెను :-

1. ధర్మ కురు క్షేత్రమందున
చేరినారలు యుద్ధకాంక్షను
మామకాదులు పాండవేయులు
ఏమిచేసిరి సంజయా !

సంజయుడు పలికెను :

2. పాండవవ్యూహమును గాంచిన
ధార్తరాష్ట్రుడు తల్లడిల్లుచు
గురుని ద్రోణుని చేరి రాజా
జనియు పలికెన్

3. చూడుమా యాచార్యవర్య
ద్రుపదపుత్రుని శిష్యుని
వ్యూహరచనావిరచితమ్ము
పాండవుల చమువున్

9. ఎందరో వీరాధివీరులు
అస్త్ర శస్త్ర కృపాణపాణులు
అటులే నాకొఱకు వారై
మడియ నుండిరయా

10. భీష్మరక్షిత మస్మదీయము
బల మ్మమిత మటయు నియ్యెడ
భీమరక్షిత పాండవుల బల
మల్ప మరయంగన్

11. మీరు మీమీ వ్యూహములలో
యథాస్థానములందు నిలిచి
అప్రమత్తులరగుచు నెల్లరు
భీష్ము కాపాడన్

12. రాజరాజును ప్రోత్సహింపగ
కురువృద్ధుడు భీష్ము డంతట
సింహనాదము చేసి శంఖము
నొత్తియూది మహోన్నతిన్

13. ధార్తరాష్ట్రుని సైన్య మెల్లను
శంఖభేరీ పణవ గోముఖ
ఆనకధ్వని చెలగె నొక్కట
దిక్కు లవియంగన్

14. శ్వేత హయముల నొప్పురథమున
మాధవార్జును లధివసించిరి
దివ్యశంఖము లొత్తియూదిరి
దిశలు మార్మ్రోంగన్

15. పాంచజన్యము హృషీకేశుడు
దేవదత్తము నింద్రసూనుడు
పౌండ్రకమ్మును భీమసేనుడు
నొక్కపెట్టున నొత్తియూదిరి
చదలు గ్రిక్కదలన్

16. పృథాసూనుడు యుధిష్ఠిరుడను
యొత్తె శంఖ మనంతవిజయము
సుఘోషమ మణిపుష్పకంబులు
కవల లూదిరి క్రమముగన్

17. మహేష్వాసుడు కాశిరాజు
మహారథుడౌ ద్రుపదపుత్రుడు
శిఖండియు విరటుడును సాత్యకి
అతిభయంకర శంఖఘోషలఁ
చేసి రుత్సుకులై

18. ద్రుపదరాజును ద్రౌపదేయులు
బాహుబలు డభిమన్యువీరుం
డాదిగాగల సమర శూరులు
శంఖముల నూదన్

24. ద్రోణ భీష్మ ప్రముఖుల భూనాధుల
యెదుట నరదము నిలిపి కృష్ణుడు
"పరికింపుము పోరజూడుము
పార్థా"! యనియెన్

25. అరయ సేనలనున్న యాప్తుల
తాత తండ్రుల గురుల భ్రాతల
పుత్ర పౌత్రుల సఖుల శ్వశురుల
గాంచె నరు డంతన్

26. ఆహవస్థలినున్న యెల్లర
నాత్మబంధులజూచి యర్జును
డతుల కరుణాప్రవణమతియై
పలికె శోకమునన్

అర్జునుడనెను:-

27. కేశవా యాత్మీయు లందరు
సమరకాములై రాగ వచ్చిరి
రణము దారుణమారణంబగు
నెట్లు సహియింతున్

28. అవయవంబులు శిథిలమాయెను
శరీరంబున కంప మొదవెను
కంఠశోషయు రోమహర్షము
నన్ను గ్రమ్మెను మాధవా!

29. గాండీవము చేజారుచున్నది
మండుచున్నది యొడలు కృష్ణా!
మతిభ్రమణము కల్గుచున్నది
దుర్నిమిత్తములరయుచుంటిని
నిలువ లేనింకన్

30. ఆహవంబునవైన వారల
నందరను బరిమార్చి యుద్యత
విజయ రాజ్యరమాసుభోగము
నందలేనయ్యా!

31. గురులు పితరులు పితామహులును
పుత్రులును పౌత్రులును మిత్రులు
బాంధవులు సంబంధులంతా
వచ్చి రని పోరన్

32. ధనము మానము ప్రాణమందక
మాహవమ్మున నాహుతియగ
సిద్ధమతులై చేరి రెంతరొ
చూచితె కృష్ణా!

33. వలదు విజయము వలదు రాజ్యము
వలదు సుఖములు వలదు భోగము
రాజ్యభోగము లేలనీవిక
మేలు కాదు పరాత్పరా!

34. రాజ్యభోగము లెవరికొరకో
వార లందరు ధనప్రాణా
శలను వీడి రణాభిముఖులై
వచ్చి వారదె కాంచుమా॥

35. త్రిదివమహారాజ్యము లభించిన
జంపజాలను బంధుజాలము
నవనిరాజ్యరమైకలబ్ధికి
హంత నెట్టాదున్

36. ధార్తరాష్ట్రులఁజంప మన కెటు
ప్రీతికల్గును వాసుదేవా
ఆతతాయులె యైనవారల
జంపి పాపము నందలేన్

37. గృహముకాల్చిన విషముపెట్టిన
రాజ్యరమణుల రచ్చకీడ్చిన
శస్త్రపాణి ధనాపహారులు
ఆతతాయి ఖలుల్

38. కలుషవర్తులు కఠినచిత్తులు
కుటిలధర్ములు కూటనీతులు
బంధు ధనదారాపరాధులు
పాపకర్ములే

39. ఆతతాయుల సంహరించుట
ఖండనమ్మున ధర్మమైనను
బంధుజన సందోహనాశము
పాపమని యెంతున్

40. రాజ్యలోభాక్రాంతమతులై
కులక్షయమును బంధునాశము
మిత్రద్రోహము పాతకములని
యెంచ రీమూర్ఖుల్

41. ఆశలను పాశములఁ జిక్కుచు
పాపమిది యని యెరిగి యెరిగియు
బాంధవాళిని ఖండనమ్మున
నెట్లు మాయింతున్

42. ప్రేమపాశము, బంధు బంధము
పాపభీతియు వంశలోభము
మమత్వంబును నొప్పకున్నవి
కులక్షయమునకున్

43. కులక్షయమున సనాతనకుల
విమత ధర్మము లన్ని కూలును
ధర్మహానిని కుల మశేషము
ధర్మదూష్యమగున్

44. ధర్మ విరహిత సంఘమందున
కులస్త్రీ శీలమ్ము గోల్పడు
శీలసంపద గోలుపోయిన
వర్ణసంకరమౌ

45. వర్ణసంకర మైనకులమును
కులఘ్నులు పితరులును కూడను
పిండ ముదకము లేక వారక
దుఃఖమందు దురచ్యుతా।

46. వర్ణసంకర కారకుండగు
కులఘ్నుడు దోషానలంబున
జాతి కులధర్మములు జగతిని
దగ్ధ మొనరించున్

47. వర్ణ ధర్మ విహీనజనులకు
నరకమే శాశ్వత శరణ్యము
జ్ఞానహీనత పశుప్రవృత్తియు
వవని వర్తించున్

48. రాజ్యలోభా కృష్టమతినై
స్వజనహత్యకు పూని దుస్సహ
పాపకర్మ మొనర్పఁజూచుట
యెంతనీచము మాధవా।

49. అస్త్ర శస్త్రాయుధోన్మత్తులు
ధార్తరాష్ట్రు లధర్మపరులై
శస్త్రరహితుని నన్ను జంపిన
క్షేమమే యగు మాధవా।

సంజయుడు పలికెను-

ఇట్లు పలికిన పృథాపుత్రుడు
చాపనారాచములు వీడుచు
శోకవిచలితమానసుండై
చతికిలంబడె రథమునన్

భగవద్గీతాసుధామాధురి అర్జున విషాదయోగము
ప్రథమాధ్యాయము.

)o(

# రెండవ అధ్యాయము - సాంఖ్యయోగము

సంజయుడువల్కెను -

1. అశ్రుపూర్ణాకులేక్షణుడును
శోకమోహవికారవదనుడు
కృపావిష్టమనస్కుం డగు వరు
జూచిహరివల్కెన్

భగవానుడువలికెను

2. అనార్యోచితమప యశఃకర
మట్లు స్వర్గాటంకమగునీ
మోహ మెట్టుల నిన్ను జేరెను
విషమసమయమునన్

3. హృదయదౌర్బల్యమును వీడుము
విడువు పౌరుషహీన భావము
నీదు కర్తవ్యమ్ము యుద్ధము
జేయలే లెమ్మా ః

అర్జునుడువలికెను-

4. పూజనీయులు భీష్మద్రోణుల
కూ్రరనారాచముల గొట్టుచు
నాహవమ్మున వారి నెట్లు నె
దిర్చి పోరుదు మాధవా।

5. గురులఁజంపక భిక్షాన్నము
నారగించెడి బ్రతుకె శ్రేయము
వారి జంప లభించురక్తపు
కూడు దినజాలన్

6. ఏది శ్రేయమొ తెలియకుంటివి
గెలుపు నోటమి తెలియరానివి
ఎవరి జంపిన బ్రతుకలేమో
వారె యనిమొన నిలిచియుండిరి
ధార్తరాష్ట్రాదుల్

7. ఆత్మతత్త్వ జ్ఞానశూన్యుఁడ
ధర్మసంకటమోహచిత్తుఁడ
శరణు వేడితి శిష్యుఁడను నీ
శాసనంబున నడుపుమా

8. శత్రురహితము సుసంపన్నము
నైన భువి దివి ప్రభుత గల్గియు
నింద్రియమ్ముల శావ మణచెడి
జ్ఞాన మే నెరుగన్
సంజయుడువల్కెను–

9. యుద్ధమును నే చేయలే నిక
హృషీకేశా యనుచు పార్థుం
డూరకుండెను మాటలాడక
శోకవ్యాకులుడై

10. ఉభయసేనామధ్యమున గడు
శోకవిహ్వలచిత్తు నర్జును
హాసనదృక్కుల జూచి కృష్ణుడు
పలికెనీరీతిన్

భగవానుడు పలికెను -

11. ఏలశోకమ్ము శోచ్యులకై
బుద్ధివాదనపటిమ జూపెదు
ప్రకృతిసహజము చావు పుట్టుక
జ్ఞాని వగవడు భారతా ॥

12. నీవుగానీ నేనుగానీ
మోహరించిన వీరుగానీ
నిన్న నేడును రేపునెపుడును
లేకపోవుట లేదయా।

13. బాల్య కౌమారములు యౌవన
వార్ధకంబులు కలిగినట్లే
జ్ఞాని దేహాంతరప్రాప్తికి
శోకమందడు ఫల్గునా ।

14. ఇంద్రియమ్ములు విషయసంగతి
ద్వంద్వములు కల్గించుచుండును
రాకపోకలు నస్థిరమ్ములు
నోర్పు గనుమయ్యా।

15. ధైర్యశాలియు విషయవిముఖుడు
మోహదూరత ద్వంద్వసముడై
మోక్షమున కర్హతను బొందును
ఆత్మరతు డౌటన్

16. ఉన్నదానికి లేమి యుండదు
లేనిదానికి నునికి యుండదు
కలిమి లేముల తుదిని నిశ్చయ
మాత్మవిదు డెరుగున్

17. నాశరహితమ్మైన యాత్మచె
లోకములు వ్యాపింప బడినవి
అవ్యయాత్మ వినాశదక్షులు
లేరు బీభత్సు।

18. అపరిమేయుడు జీవు డవినా
శుడును తనువులు నశ్వరమ్ములు
నగుట దుఃఖ మ్మిడిగి చేయుము
యుద్ధమును పార్థా!

19. చంపునదియును చంపబడునది
ఆత్మయని భావించువా రిల
వజ్ఞు లర్జున। ఆత్మ చంపదు
చంపబడదయ్యా!

20. ఆత్మ నిత్యమనాది పూర్వము
లేకపోవుట మరల గలుగుట
పుట్టి గిట్టుట నుండ దాత్మకు
దేహమరణము దేహి కంటదు
సత్య మిది పార్థా!

21. నిత్య సత్యం బక్ష యమ్మని
ఆత్మ నెరిగిన పూరుషుం డిల
ఎవరి నెట్టులచంపు? నెవ్వని
నెట్లు చంపించున్

22. జీర్ణవసనము వదలి మనుజుడు
కొత్త పుట్టము గట్టినట్టుల
శిథిలదేహము వీడి నూతన
దేహమును బొందున్

23. శస్త్రములు ఛేదింపజాలవు
అగ్ని కాల్పగ నీరు తడువగ
మారుతము శోషింప జేయగ
జాల వీయాత్మన్

24. ఛేదనంబును దాహమును మరి
శోషణంబును క్లేదమును లే
వాత్మకును సుస్థిరము నిత్యము
సర్వగత మరయన్

25. అవాఙ్మానసగోచరుం బ
వ్యక్త మవికార్యాత్మ యని నీ
వనుభవ జ్ఞానమున నెఱిగిన
లేదు దుఃఖం బర్జునా ।

26. చావు పుట్టుక లెప్పుడును నీ
దేహి కున్నవి యనినగానీ
శోకమోహము లందగాదగ
దంతరంగమునన్

27. పుట్టు జీవికి చావు తప్పదు
గిట్టు ప్రాణికి జన్మ తప్పదు
తప్పనప్పుడు దుఃఖ మేటికి
తత్త్వ మెరుగుమయా ।

28. జననమందకపూర్వమును మరి
మరణమందినపిదవ కనబడ
దాది యంతములందు లేకయు
మధ్య మనలెడి దేహమునకై
దుఃఖమందగ నేటికిన్

29. అద్భుతం బని చూచునొక్కడు
అద్భుతం బని చెప్ప నొక్కడు
వినుచు వచ్చెరు వందు నొక్కడు
స్వానుభవమున నాత్మ గాంచరు
వీర లెవ్వరు భారతా ।

30. సర్వ జీవుల తనువులందున
దేహి నిత్యుండుండుభారత ।
చంపశక్యముకాదు జీవుల
దుఃఖమదియేలా ?

31. స్వధర్మంబే యరసి చూచిన
ధర్మచలనము నీకు తగునే
క్షత్రియునకును ధర్మయుద్ధమె
శ్రేయమైవరలున్

32. పుణ్యవశమున సంభవించిన
తెఱచియుందిన స్వర్గద్వారము
వంటి యుద్ధము క్షత్రియునకే
లభ్యమౌసుఖికే

33. ధర్మకర్తవ్యమ్ము యుద్ధము
చేయవేని స్వధర్మ కీర్తులు
కోలుపోవుటకాదువుడమిని
పాప మందెదు ఫల్గునా

34. నీదు తుయవకీర్తిగాథను
లోకు లెల్లరుచెప్పికొందురు
లోకపూజ్యుడవైన నీకవ
కీర్తి మరణముకంటె దారుణ
మౌను యోచింపన్

35. నిన్ను పొగడెడి మహారథులే
యుద్ధభయమున పారినా వని
పిరికివం దిల గేలిచేయుచు
కించపరతురు పాండవా।

36 నీదు సామర్థ్యమ్ము శౌర్యము
శాత్రవులు దూషించి నీచపు
భాషలాడగ వినుటకంటెను
దుఃఖతరము న్నె?

37. జయము రాజ్యరమానుభవ మిడు
వీరమరణ మ్మొసగు స్వర్గము
రెంటిలో నేదైన మేలే
యుద్ధధర్మోత్సాహమతివై
లెమ్ము కౌంతేయా।

38. సుఖము దుఃఖము లాభమును మరి
నష్టమును జయ మపజయమ్మును
సమముగా మది నెంచి పోరిన
పాప మంటదు ఫల్గునా।

39. సాంఖ్యమందలి యాత్మతత్త్వము
నెరుకపరచితి నింతదనుకను
కర్మబంధచ్ఛేదకమ్మగు
యోగ మెరిగింతున్

40. కర్మయోగపథాను గమనమ్ము
సుంత పొగిన సఫలదం బగు
భయదభవబంధమును ద్రెంచియు
నరుని రక్షించున్

41. నిశ్చయాత్మక కర్మయోగికి
నిశ్చలం బగు బుద్ధియొక్కటె
యత్నహీనుల మతులు భిన్నము
లంతులేనివి ఫల్గునా।

42. వేదచోదితమధురసూక్తుల
అర్థవాదగ్రహణమతులై
ఫలాపేక్షయె పరమ లక్ష్యం
బంచు నెంతురు కవ్వడీ।

43. స్వర్గసౌఖ్యాపేక్షకాంక్షులు
ఇహపరమ్ముల భోగదములౌ
కామ్యయాగము లాచరించెడి
అల్పమతులై శూన్యఫలముల
నందుచుందురు భారతా।

44. అస్థిరమ్మగు చిత్తవమ్మో
కర్మకాండపరికాండ మంతయు
వేదచోదిత మైనదైనను
చావు పుట్టుక కారణమ్మై
నరుని బంధించున్

45. త్రిగుణ ద్వంద్వాతీతమతివై
నిత్యసత్వ సమత్వదృష్టిని
యోగమును క్షేమమును మీరిత
జ్ఞానివై మనుమా ।

46. ఎల్లెడల జల మున్న యప్పుడు
కూపమున పని యెంతయుండునొ
బ్రహ్మవేత్తకు వేదజాలం
బంతె యవసరమా ।

47. కర్మమున కధికారి వంతియ
ఫలమునందగ కాదుపార్థా ।
కర్మఫలమం దాశవీడుము
కర్మ వీడకుమా ।

48. మోహమందక యోగి వగుమా ।
సఫలమైననువిఫలమైనను
సామ్యమతివై కర్మ జేయుము
సమత్వమ్మే యోగమా ।

49. కామ్యకర్మమునీచతమమగు
యోగకర్మంబుత్తమము,ని
ష్కామకర్మాచరణసమతా
చిత్తుడవుకమ్మా ।



50. యోగకర్మమునిష్ఠచిత్తుడు
సత్కృతంబునుదుష్కృతంబును
ఇహమునందేవిడచివై చును
కుశలకర్మమెయోగమర్జున
యోగివై మనుమా

51. సామ్యచిత్తవివేకవర్తులు
కర్మఫలత్యాగమునుజేసియె
జన్మబంధముదొలగిమోక్షము
నందుదురుపార్థా ।

52. మోహకలుషవిముక్తమతిను
జ్ఞాననిత్యానందమందిన
వినినవియు వినబోవు బోధల
యవసరములేదర్జునా ।

53. వివిధబోధల కలతజెందిన
నీదు చిత్తము నిశ్చలంబై
ఆత్మరతి నిర్మగ్నమైనచో
యోగి వౌదువు కవ్వడీ ।

అర్జునుడు :-

54. సమాధిస్థిత స్థితప్రజ్ఞుని
స్థిమితచిత్తుని లక్షణంబులు
భాషయును భావంబు నడవడి
ఎట్టులుండును మాధవా ?

భగవానుడు :-

55\. సర్వకామవివర్జితాత్ముడు
సదా బ్రహ్మానందతుందిలు
డాత్మరమణానందతుష్టుడు
స్థితప్రజ్ఞుడు ఫల్గునా

56\. దుఃఖమందున గలత నొందడు
సుఖమునం దాసక్తి నందడు
క్రోధ రాగ భయాదిదూరుడు
స్థితప్రజ్ఞుడు కవ్వడీ!

57\. సర్వ విషయాసక్తిశూన్యుడు
ప్రాప్త సుఖదుఃఖాదిసంగతి
ద్వేషవిరహితతత్త్వచిత్తుడు
స్థితప్రజ్ఞుడుపాండవా।

58\. విషయవాంఛాదూరధృతిమతి
ఇంద్రియములనిముడ్చు నెతదను
అంగములుకుదియించుకచ్ఛప
మట్లుయోగమునన్

59\. ఇంద్రియమ్ములగెలుచుధృతమతి
విషయభోగవిదూరు డగుటను
ఆత్మదర్శన మందినంతనె
వాసనల బాయున్

60. శక్తిమంతములింద్రియమ్ములు
తత్త్వసాధకుడైనప్రాజ్ఞుని
మనసునైతముకొల్లగాగొని
క్షోభపరచునుఫల్గునా ।

61. ఇంద్రియమ్ములనోడ్చి స్థిరమతి
ఆత్మతత్త్వరచిత్తవృత్తిని
మత్పర మ్మొనరించి యోగియు
స్థితప్రజ్ఞుండౌనిలన్

62. విషయచింతనమానసున కా
విషయమందాసక్తి కలుగును
దాన కామమునొదవు కామమె
క్రోధ హేతువగున్

63. క్రోధముననవివేకమొదవును
దాన తనుజ్ఞాపకరహితమనలును
అంతబుద్ధివినాశమ్మంతట
నధఃపతితుడగున్

64. నరుడురాగద్వేషరహితుం
డాత్మవశ్యేంద్రియగణమ్ముల
విషయసుఖముల ననుభవించుచు
శాంతినందునుభారతా

65. మనశ్శాంతిని సర్వదుఃఖము
లంతరించును శుద్ధచిత్తుని
బుద్ధిశీఘ్రమై ఆత్మరతమై
పెంపుగాంచువడిన్

66. ఇంద్రియమ్ముల యదుపు నెరుగక
బుద్ధి సద్భావనల నందదు
దాన నరు డిల శాంతినందదు
సుఖముశూన్యంబౌ

67. గాలి యెదురుగవీచి నీటను
నావనెచటికొ నెట్టినట్టుల
చంచలేంద్రియలోలుచిత్తము
విజ్ఞతనుబాపున్

68. విషయసంగతిబోవనీయక
యింద్రియమ్ముల సర్వవిధముల
నిగ్రహించెడివానిజ్ఞానము
సుస్థిరమ్ముగుపల్గునా।

69. ప్రాణికోటికిరాత్రియైనను
యోగికది మేల్గాంచువేవలె
లోక మెత్తరిమేలుకొనునో
జ్ఞాని కదినిశయౌ

70. నిశ్చలంబగుపూర్ణజలధిని
నదులుకలిసెడిరీతికోరిక
లేమహాత్మునిజేరి యణగునొ
యతడె శాంతు డకామియున్

71. సకలవాంఛలు నెల్లయాశలు
నహంకారము మమత్వంబును
విడచి మనునా స్థితప్రజ్ఞుడు
శాంతుడై వరలున్

72. ఇదియె బ్రాహ్మిస్థితి యనంగమ
దీనిఁ బొందిన మోహ మందడు
అంత్యమందీస్థితియె యోగికి
బ్రహ్మనిర్వాణాత్మకంబగు
మోక్షమొదవ చూర్చున్

శ్రీమద్భగవద్గీతా సుధామాధురి_సాంఖ్యయోగము
ద్వితీయాధ్యాయము_



# మూడవ అధ్యాయము - కర్మయోగము

అర్జునుడడిగెను :-

1. కర్మకంటెనుజ్ఞాన మెక్కుడు
శ్రేష్ఠమనిచునుశ్రీనివాసా।
ఘోరమారణయుద్ధకర్మకు
నేలపురికొల్పవ్

2. ఒకటికొక్కటి విరుద్ధములగు
మోహపరచెడి నీదుమాటలు
నాకుశ్రేయము నొకేమార్గము
నిర్ణయింపుము కేశవా।

భగవానుడుపలికెను :-

3. లోకమున సాంఖ్యులకు జ్ఞానము
యోగులకు సత్కర్మయోగము
ద్వివిధములుగా వల్కితము అని
సృష్టిమొదటనెచెప్పబడినవి
పార్థ। నాచేతవ్

4. కర్మచేయక పూరుషుం డిల
పొంద డెటునైష్కర్మ్యభావము
కర్మవీడిన మోక్షసిద్ధిని
గాంచజాలడు ఫల్గునా।

5. క్షణము సైతముకర్మ చేయక
సుండరెవ్వరులోకమందున
ప్రకృతిగుణసమ్మోహవివశత
నరుడుకర్మలజేసెడిన్

6. ఇంద్రియమ్ముల నణచిపెట్టియు
విషయచింతనమానసుండౌ
కపటకర్మాచరణశీలుని
మూర్ఖుడందురు కవ్వడీ।

7. మానసమ్మును నింద్రియమ్ముల
నిగ్రహించియు వానిచేతనె
నిరాసక్తిని కర్మయోగము
జేయుపురుషుడె శ్రేష్ఠుడౌ

8. కర్మజేయక యుండుకంటెను
నియతికర్మల జేయ మేలగు
నకర్మునకు జీవయాత్రయె
నిష్ఫలం బగునర్జునా।

9. యజ్ఞకర్మేతరము లన్నియు
జన్మబంధన కారణమ్ములె
కాననిరపేక్షముగ కర్మల
నాచరింపుము కవ్వడీ

10. యజ్ఞసృష్టిని ప్రజాసృష్టిని
చేసియజు డిటు వల్కెనర్జున
యాగకర్మలెకామగవులై
యభీష్టంబులనిచ్చుచుండును
వృద్ధిగాంచుడు మానవుల్

11. దీనసుమనః ప్రీతిగూర్చుడు
సురలుమిమునంతృప్తిపరుతురు
పరస్పరసంప్రీతికరులై
శ్రీయ మందుడు పేర్మితోన్

12. యజ్ఞసంభావితులుదేవత
లిష్టభోగము:లిచ్చుచుందురు
దానసురలను దృప్తిపఱుపక
యనుభవించెడి కృతఘ్నాత్ముడు
చోరుడే యగుభారతా।

13. యజ్ఞశిష్టాశనుడుసుజనుడు
సర్వపాపవిముక్తి నందును
స్వోదరార్థమె మెసవు నఘమతి
పాపమే గుడుచున్

14. అన్న జాతము జీవజాల్యము
మేఘజాతం బవనినన్నము
యజ్ఞజముపర్జన్య మర్జున
కర్మయజ్ఞజమౌ

15. కర్మ వేదోక్తమ్ము పార్థా।
వేద మాత్మోద్భవము నిఖిలము
సర్వగతమౌబ్రహ్మమెప్పుడు
యజ్ఞమందమరున్

16. అస్మదీయప్రవర్తితమగు
లోకచక్రం బనుసరింపని
మూఢుడింద్రియ లాలసుండై
వ్యర్థజీవనుడౌ।

17. ఆత్మరతుడును నాత్మప్రీతుడు
ఆత్మసంతుష్టాంతరంగుడు
నైనజ్ఞానికి చేయుకర్మలు
జగతినుండవు భారతా।

18. కర్మచేయుటయందు లాభము
చేయకుండుటయందు నష్టము
స్వప్రయోజనసిద్ధికొఱకై
యొరులవేడగనవసరంబును
లేవుజ్ఞానికి ఫల్గునా।

19. కానసతతము విహితకర్మల
ననాసక్తత చేయగావలె
అట్టి కర్మాచరణశీలుడు
మోక్ష మందును ఫల్గునా

20. కామరహితముకర్మ జేసియె
మోక్షమందిరిజనకముఖ్యులు
లోకసంగ్రహణార్థమతివై
కర్మ చేయుముఫల్గునా।

21. శ్రేష్ఠుడేకర్మమునుచేయునొ
తక్కుజను లదెయాచరింతురు
సుజనుకెద్దిప్రమాణమగునో
లోకమునకదెయు క్తమౌ

22. త్రిభువనంబులవిహితకర్మలు
పొందబడనివి పొందవలసిన
వింతుకైనను లేవునాకిల
ఐన జేయుదుకర్మలన్

23. నిత్యమునునేజాగరూకత
గర్మములవర్తింపకున్న చొ
లోకులందరునాదుమార్గమె
యనుసరింతుడఫల్గునా।

24. కర్మలను నేచేయకున్న తొ
వర్ణసంకరకారకుడనై
లోకనాశకరుడ నౌదును
గానచేయుదు కర్మలన్

25. ఫలాపేక్షనుపామరుం డిల
కర్మచేయును జ్ఞాని యటులే
నిరాసక్తినిచేయగావలె
లోకసంగ్రహణార్థమై।

26. కర్మసంగునిమనసునొంపక
కామవిరహితవిహితకర్మల
చేయు నిలచేయించునొరులచె
జ్ఞానికుశలుండై

27. ప్రకృతిగుణములుకారణంబుగ
వివిధ కర్మలుజరుగుచున్నవి
అహంకారవిమూఢచిత్తుడు
తానెకర్తననున్

28. ప్రకృతిగుణములువిషయగుణసం
వర్తనము లనియెరిగి యుంటచె
భారతా! గుణకర్మవిభజన
తత్త్వవిదు డాకర్మలందళి
మాని కాదయ్యా।

29. ప్రకృతిగుణసమ్మోహచిత్తులు
త్రిగుణకర్మాసక్తివందుదు
రట్టిమందుల జ్ఞాని చలితుల
జేయగూడదుఫల్గునా।

30. ఆశమమకారములువీడియు
వాత్మరతమగు చిత్తవృత్తిని
సర్వకర్మలు నాకొసంగుచు
విగతతాపవిశుద్ధమతివై
చేయుమాహవమర్జునా ।

31. శ్రద్ధకలిగి యసూయ వీడియు
నిత్యమీమత మనుష్ఠించిన
కర్మబంధవిముక్తినందుదు
కర్మయోగమునన్

32. నాదుమతమిది యనుష్ఠింపక
ద్వేషమతులై మెలగుమూఢులు
నాత్మదూరులు జ్ఞానశూన్యులు
నగుచు చెడుదురు ఫల్గునా।

33 పండితుండును ప్రాణికోటియు
స్వభావాశ్రితప్రవర్తనులే
నిగ్రహం బికయేమిలాభము
గూర్పజాలునభారతా ।

34. ఇంద్రియములకు విషయములపై
రాగద్వేషము లున్నవర్జున
వరుని కవి శత్రువులుగావున
వశుడుకారా దెన్నడున్

35. సగుణపరధర్మమ్ము కంటెను
శ్రేయమౌ విగుణాత్మధర్మము
స్వధర్మంబున మృతియు మేలగు
పరధర్మము భయదమౌ।

అర్జునుడడిగెను :-

36. ఇచ్ఛ లేకయు పాపకర్మము
నెవరొ ముందుకు నెట్టినట్టుల
దేనిచేతను ప్రయుక్తుండై
చేయుపురుషుడు మాధవా।

శ్రీభగవానుడు తెల్పెను :-

37. రజోగుణమున నుద్భవించిన
కామమే క్రోధమ్ము పాపము
అనంతృప్తము మోక్షవైరియు
నదియె తెలియుము ఫల్గునా।

38. ధూమమగ్నిని మలినమద్దము
మావి గర్భంబందు శిశువును
గప్పినట్టులె కామక్రోధము
గప్పు జ్ఞానమునర్జునా।

39 పూరణంబున కలవికానిది
వహ్నివలె నంతృప్తినందదు
కామ మాశగనాత్మగప్పును
జ్ఞాని కాశయె వైరియౌ

40. ఇంద్రియములును మనోబుద్ధులు
కామమున కిల నాశ్రయమ్ములు
వానిచే నదియాత్మ గప్పియు
నరుని మోహితు జేసెడిన్

41. జ్ఞానవిజ్ఞానములమాపెడి
పాపరూపంబైన కోర్కెను
తొలుతనింద్రియనిగ్రహముచే
రూపుమాపుట శ్రేయమౌ

42. ఇంద్రియములను మతియు బుద్ధియు
నుత్తరోత్తరఃతియమ్ము లు
బుద్ధికన్నను మిన్నయైనది
యాత్మ యొక్కటె ఫల్గునా।

43. బుద్ధికంటెనునాత్మఘనమను
విజ్ఞతను మతినదుపుచేయుచు
కామశత్రుక్షయము జేయుము
నిశ్చయాత్మకబుద్ధివై

శ్రీమద్భగవద్గీతాసుధామాధురి-కర్మ యోగము
తృతీయాధ్యాయము

)O(

# నాల్గవఅధ్యాయము_జ్ఞానయోగము

శ్రీ భగవానుడు పల్కెను :-

1. అక్షయమ్మగు కర్మయోగము
మున్ను సూర్యున కేను చెప్పితి
రవియు వైవస్వతున కొసగెను
అతడు నిక్ష్వాకునకు దెల్పెను
తెలియు మోపార్థా.

2. ఇట్లువరుసగ వచ్చు దీనిని
రాజఋషులందరు గ్రహించిరి
అనుసరించెడివారులేమిని
యోగ మడుగంటెన్

3. ఆత్మసఖః భక్తుండ వగుటను
శ్రేష్ఠమును గోప్యంబు వగు నీ
సనాతనసైష్కర్మ్యయోగము
గరపితిని నీకై

అర్జునుడడిగెను :

4. నీదుజన్మము నేటిదేకద
సూర్యుజననము సృష్టినాటిది
నీవురవి కుపదేశ మొసగుట
ఎట్లుసిద్ధించెన్

భగవానుడు పల్కెను :-

5. నీకునాకుననేకజన్మలు
నేటిదనుకనుగడచెనర్జున
వానినన్నిటినే నెరుంగుద
నీకుతెలియవయా ।

6. అభవుడనునే నవ్యయాత్ముఁడ
సర్వ జీవేశ్వరుడ నైనను
నాదు ప్రకృతినధివసించియు
నవతరింతునిలన్

7. ధర్మ సంకటమైనయత్తరి
అధర్మోద్ధతిమించినప్పుడు
ఆత్మమాయావిలసితుడనై
అవతరింతుధనంజయా

8. సాధురక్షణదుష్టశిక్షణ
ధర్మసంస్థాపనకునై
యుగయుగంబులవాడనేనై
యవతరింతును ఫల్గునా ।

9 ఇట్టిదగునాజన్మకర్మల
తత్త్వమునుగ్రహియించువిజ్ఞుడు ।
చనినపిమ్మటజన్మమెత్తక
నన్నె పొందునునమ్ముమా

10. వీతభయక్రోధానురాగులు
మన్మయులు మద్భక్తవర్యులు
జ్ఞానతాపసముఖ్యు లెందరొ
నన్ను పొందిరి భారతా ।

11. ఎవరు నన్నెటు లాశ్రయింతురొ
వారి నట్లె యనుగ్రహింతును
సర్వవిధముల నాదుమార్గమె
యనుసరింతురు భూజనుల్

12. కర్మసిద్ధిని కాంక్షజేసెడి
నరులు దేవుల నాశ్రయింతురు
కారణము నీలోకమందు వె
సిద్ధి శీఘ్రమె కల్గుటన్

13. పార్థ! గుణకర్మముల విభజనం
జాతుర్వర్ణములే సృజించితి
కర్తనై నను కానివాడను
నిర్వికారుడ నెరుగుమా ।

14. కర్మములు నన్నంటవంటును
కర్మఫలస్పృహ నాకు లేదని
తెలియువాతడు కర్మములచే
గట్టుబడడయ్యా ।

15. ఇట్లుపూర్వముముక్షులందరు
దెలిసినిస్పృహఁగర్మజేసిరి
నీవు నట్లె సనాతనమగు ని
ష్కామకర్మముజేయుమా ।

16. ఏదికర్మమొ యే దకర్మమొ
తెలియవిజ్ఞులెమోహమందిరి
దీనిదెలిసినముక్తుఁడగుదువొ
అట్టికర్మరహస్యమిప్పుడు
నీకుదెలిపెదనర్జునా ।

17. శాస్త్రచోదిత 'కర్మ'తత్త్వము
శ్రుతినిషిద్ధ వికర్మరూపము
కర్మకాని యకర్మరీతియు
గహనములు గోప్యములు గావున
తెలియగావలెఖారరా ।

18. ఎవడుకర్మమునం దకర్మము
నకర్మంబునఁ గర్మగాంచునొ
సకల కర్మాచరణు డాతడె
యోగి,ప్రాజ్ఞుడు,యుక్తుఁడున్

19. కామసంకల్పములు కాని
ఎవనికర్మలు జ్ఞానవహ్నిని
దగ్ధమగునో యతని జ్ఞానులు
ప్రాజ్ఞుఁడందురు ఖారరా ।

20. కర్మఫలసంగమును వీడిన
నిరాశ్రయుడా నిత్యతృప్తుడు
కర్మలను చేసియు నొకింతయు
కర్త కాడని యెరుగుమా

21. నిర్గతాశుడు నియతచిత్తుడు
త్యక్త సర్వపరిగ్రహుండు నై
లోకసంగ్రహకర్మచేతను
నఘము పొందడు ఫల్గునా ।

22. భువి యదృచ్ఛాప్రాప్తతృప్తుడు
ద్వంద్వమత్సరసిద్ధ్యసిద్ధుల
కతీతుండై చేయుకర్మలు
బంధములు కా వెప్పుడున్

23. సంగరహితుడు ముక్తబంధుడు
జ్ఞానచిత్తుడు యజ్ఞకర్ముడు
నైనప్రాజ్ఞునికర్మ లన్నియు
బంధరహితములర్జునా ।

24. హోమసాధన హోమద్రవ్యము
లగ్ని హోతయు హుతము సర్వము
బ్రహ్మమని యేకాగ్రమతియై
యాగయోగము సేయుప్రాజ్ఞుడు
తానె బ్రహ్మ మగున్

25. యోగులందునకొంద రర్జున
దైవయజ్ఞమునమష్ఠింతురు
కొందర ద్వైతాత్మ యోగులు
బ్రహ్మవహ్ని నిజీవ వ్రేల్తురు
బ్రహ్మభావమునన్

26. ఇంద్రియమ్ములనిగ్రహాగ్ని ని
విషయములనయ్యింద్రియాగ్ను ల
వారియోగవథానుసారము
వేల్త్రు రర్జున నియతిమై.

27. కొంద రింద్రియ ప్రాణకర్మల
జ్ఞానదీప్తంబగుచువెలిగెడి
సంయమాత్మకయోగవహ్ని ని
ఆహుతింతురుభారతా ।

28. ద్రవ్యయజ్ఞము తపోయజ్ఞము
జ్ఞానవేదాధ్యయనయజ్ఞము
యోగయజ్ఞము లనుసరింతురు
ధృఢవ్రతచిత్తుల్

29. నియత ప్రాణాయామనిష్ఠులు
రుద్ధప్రాణాపానగతులై
ప్రాణవాయువు నపానంబున
అపానంబున ప్రాణమందుననా
నాహుతింతురు ఫల్గునా ।

30. యజ్ఞవిదులాహారనియతిని
ప్రాణమును నాప్రాణముంచి
వేల్చి యజ్ఞక్షపితకల్మషు
లౌదు రెందరో యర్జునా ।

31. యజ్ఞశిష్టాశనుడు సుజనుడు
సనాతనమౌ బ్రహ్మఁబొందును
యజ్ఞహీనునకిహమె లేదన
వరముమాటేలా ।

32. వేదముల బహువిస్తృతంబుగ
వివిధక్రతువులు తెలుపబడినవి
యెరుగుమన్నియు కర్మజము లని
తెలిసి ముక్తిని గాంచుమా ।

33. అర్థసాధన క్రతువుకన్నను
జ్ఞానయజ్ఞమె శ్రేష్ఠ మర్జున
కర్మములు నిశ్శేషములుగా
జ్ఞానమున లయమౌ ।

34. తత్త్వదర్శనులై జ్ఞానుల
పదములంబడి సేవజేయుచు
సమయ మారసి విధేయుడవై
జ్ఞానభిక్షను వేడి శ్రద్ధగ
పొందగావలె బోధలన్

35. దీని నెఱిగినమోహము త్రుంచి
జీవులనునీలోన నాలో
సకలమందునగాంచగలవో
యట్టిజ్ఞానము నందుమా ।

36 నీవుపాపులలోనమిక్కిలి
పాతకుడవటంచుతలచిన
జ్ఞానపోతమెచాలు నీయఘ
సాగరముదాటన్

37. సమిధలనుజ్వలితాగ్నిజ్వాలలు
భస్మరాశిగజేయురీతిని
జ్ఞానవహ్నియొసర్వకర్మల
భసితమొనరించున్

38. జ్ఞానసమమ్ముపవిత్రమేదియు
లోకములనెచ్చటనుగానము
యోగసిద్ధుడుకాలమందున
దాని నందును స్వయముగన్

39. శ్రద్ధతాత్పర్యములుగల్గిన
సంయమీంద్రుండమలభావక
జ్ఞానియై శీఘ్రమెప్రశాంతిని
పొందగల్గుముకవ్వడీ

40. జ్ఞానహీనుడుశ్రద్ధరహితుడు
సంశయాత్ముడు నాశమందుదు
రందుసంశయచిత్తు డిహపర
సుఖముగోల్పోవున్

41. ఈశ్వరార్పణకర్మయోగిని
జ్ఞానసంఛిన్నాత్మసంశయు
నాత్మవంతుని కర్మలేమియు
నిబంధింపవు ఫల్గునా ।

42. అజ్ఞతాభవసంశయమ్మును
జ్ఞానకరవాలమునదుంచియు
జ్ఞానయోగముజేయు లెమ్మిక
నిశ్చయాత్ముడవై ।

శ్రీమద్భగవద్గీతాసుధామాధురి జ్ఞానయోగము
చతుర్థాధ్యాయము

# ఐదవ అధ్యాయము - కర్మసన్న్యాసయోగము

అర్జునుడడిగెను :-

1. కర్మసన్న్యాసమునొకప్పుడు
కర్మయోగమునొక్కమారును
ప్రశంసించుచునుంటివచ్యుత
ఏదిశ్రేయస్కర మందొక్కటి
నిశ్చయమ్ముగదెల్పుమా ।

భగవానుడు తెల్పెను :-

2. కర్మసన్న్యాసమును యోగము
నుభయములు నిలమోక్షదములే
అందుసన్న్యాసమ్ము కంటెను
కర్మయోగమె శ్రేష్ఠమౌ

3. ద్వేషరహితుడు కాంక్షదూరుడు
నిత్యమును దా త్యాగియే యగు
ఏలయన నిర్ద్వంద్వచిత్తుడు
మోక్షమందును నశ్రమన్

4. సాంఖ్యయోగము కర్మయోగము
వేరటం చవివేకులందురు
రెంట దేనినియనుష్ఠించిన
ముక్తు డౌనువరుం డిలన్

5. సాంఖ్యులే మోక్షమును గాంతురా
కర్మయోగులునదియె పొందుదు
రుభయములు నివి మోక్షదము లని
తెలియునాతడె విజ్ఞుడా ।

6. కర్మయోగము వినా సాంఖ్యము
వశక్యంబౌ పొందనర్జున
యోగయుక్తుండైన మునివరు
డాత్మ బొందును శీఘ్రమే ।

7. విజితచిత్తుడు విశుద్ధాత్ముడు
సర్వజీవులలోన తనలో
నాత్మ గాంచు సుకర్మకుశలుడు
భవమునం బడడెన్నడున్

8. తలచు నాదిగ సర్వకర్మలు
బ్రహ్మవిదుడౌ యోగి యింద్రియ
విషయసంగతిగా నెయెంచును
కర్త దా నవడే క్రియన్

9. చూచు, విను, మాటాడు దాకును
గుడుచు నాఘ్రాణించు తడుచును
శ్వసించును నిద్రించు లోగాను
విడచు మూయును తెరచు కర్మలు
సాక్షిమాత్రుని గాన్

10. ఫలాపేక్షనువీడికర్మల
బ్రహ్మమునకర్పణముజేసిన
తామరాకునవీటిబొట్టుగ
పాపమంటదుఫల్గునా ।

11. యోగు లెల్లరుచిత్తశుద్ధికై
ఫలాసక్తిని మమత్వంబును
వీడియింద్రియమనోబుద్ధుల
చేయుచుందురుకర్మలన్

12. యోగయుక్తుడుకర్మఫలమును
వీడినైష్ఠికశాంతిబొందును
యోగరహితుడుఫలాపేక్షను
కర్మబద్ధుండౌ ।

13. సర్వకర్మలఫలముమనసా
సన్న్యసించినజితేంద్రియు డిల
చేయక నుచేయించకను దే
హమునమండునుసుఖముగన్

14. నరునిపాపముపుణ్యములు స
ర్వేశ్వరుడుదా స్వీకరింపడు
తెలివినజ్ఞానమ్ముగప్పగ
జీవిభ్రమజెందున్

15. కర్మమును కర్తృత్వమును ఫల
కాంక్షయునుదాదైవ మీయడు
ప్రకృతివలననెల్గుచుండును
జన్మ జన్మలకున్

16. ఎవరి సుజ్ఞానమ్ము, నాశము
చేయు నజ్ఞానమును, నాసరు
జ్ఞాన మాత్మను వెలుగఁజేయును
భాస్కరునివోలెన్

17. మనసు బుద్ధియు నిష్ఠభావన
నాత్మ మగ్నముఃజేయు వారలు
జ్ఞాననిర్ధూతాఘమతులై
ముక్తి బొందుదు రర్జునా ।

18. వినయ విద్యాకలితు విప్రుని
గోవు నేనుగు శునకమును మరి
శ్వమాంసాశను సామ్యదృష్టిని
గాంచు యోగి వివేకతన్

19. సామ్యదర్శన సుస్థిరాత్ముల
నిహమునసె భవముం జయింతురు
అదోషాత్మమునందు చిత్తమ్ము
సుస్థిరమ్ముగ నుండుటన్

20. మోహవర్జిత నిశ్చితాత్ముడు
ఆత్మసంస్థిత బ్రహ్మవేత్తయు
ప్రియాప్రియముల పొంగి కుందగడు
జ్ఞాని కానౌటన్

21. బాహ్యవిషయాసక్తిదూరుడు
నిరతిశయ సుఖశాంతచిత్తుడు
బ్రహ్మనిష్ఠత నక్షయం బగు
నాత్మసుఖ మందున్

22. విషయసుఖములుదుఃఖహేతువు
లచిరమునశియించు పార్థా।
జ్ఞానియందు రమింపడెన్నడు
నశ్వరములౌటన్

23. ఇచ్చటనె చచ్చుటకు పూర్వమె
కామమునుక్రోధంపు క్షోభము
లణచు నేనరు డతడె యోగియు
సుఖియు నౌపార్థా।

24. ఆత్మసుఖియును నాత్మరమణుడు
నాత్మజ్యోతిగ వెలుగు నంయమి
బ్రహ్మమే తానౌచు బ్రహ్మ
పదమును పొందున్

25. పాపరహితులు ఛిన్న సంశయులు
అఖిలభూతహితానువర్తులు
జితేంద్రియులౌ బ్రహ్మవిద్వులు
మోక్ష మందుదు రర్జునా।

26. కామక్రోధాదులను మనమును
నిగ్రహించిన యాత్మవిదులౌ
నియత యతివరు లెటులున్నైనను
ముక్తిగాంతురు భారతా।

27. స్పర్శ మున్నగు బాహ్యవిషయా
దులను బైటకె నెట్టివైచియు
చూడ్కి భ్రూమధ్యమున నిలిపియు
శ్వాస నాసికయందు సమముగ
నుంచగావలె సవ్యడీ।

28. నిగ్రహేంద్రియమనోబుద్ధులు
కామక్రోధభయాదిదూరులు
మోక్షకాంక్షులు మౌనివర్తము
లందుదురు ముక్తిన్

29. యజ్ఞభోక్తగ మహేశ్వరునిగ
సకల భూతహితానువర్తిగ
నన్నెరింగిన జ్ఞానఘనులే
శాంతి గాంతురు ఫల్గునా।

భగవద్గీతాసుధామాధురి కర్మసన్న్యాసయోగము
పంచమాధ్యాయము

)-(

# 6వ అధ్యాయము - ఆత్మసంయమయోగము

1. ఫలాపేక్షారహితకర్ముడు
యోగియును సన్న్యాసి యౌనిల
అగ్నికార్యముమానికర్మల
విడుచునాతడయోగ్యుడౌ

2. కామసంకల్పములువిడక
యోగికాడెవ్వడును పార్థా
యోగమనసన్న్యాసమే యది
ఆత్మసంగతమౌ

3. యోగసిద్ధినిగోరు మౌనికి
కర్మయోగమె సాధనంబౌ
శమము యోగారూఢునకు సం-
సాధనము పార్థా !

4. విషయకర్మాసక్తిరహితుడు
పూర్వసంకల్పములు విడిచిన
నతడె యోగారూఢు డగుచుం
ఆత్మ సంస్థితి చేన్

5. తనకుతానే రిపుడు బంధుడు
తనకు దా హైన్యంబు [illegible]
తమ్ము దానే యుద్ధరింపగ
వంగ యోగి యగున్



6. మనో జయమున నవజయమ్మున
తనకు దానే హితుడు నహితుడు
హితుడు నాత్మోద్ధరణపేరకు
దహితు డజ్ఞుం డజ్ఞునా!

7. విజితచిత్తుడు పరమశాంతుడ
శీత ముష్ణము సుఖము దుఃఖము
మాన మవమానాది ద్వంద్వము
లందునను నాత్మానుభవమున
సుస్థిరాత్ముండౌ

8. జ్ఞాన విజ్ఞానాత్మతృప్తుడు
జితేంద్రియుడౌ నిర్వికారుడు
మన్ను రాయియు హేమముల సమ
దర్శనుండే యోగియౌ

9. సుహృన్మిత్రా ద్యుదాసీనులను
మధ్యముల బంధువుల రిపుల
పుణ్యపాపులయెడల సము డిల
యోగివర్యుడు భారతా!

10. విజితచిత్తేంద్రియుడు నాశా
రహితుడై యపరిగ్రహుండై
సంతతం బేకాంత మాత్మన
మాధి నుండవలెన్

11. శుద్ధ సమతలమందు చేలా
జిన కుశోత్తరసుఖాసనమున
స్థిమితమతియై చిత్తశుద్ధికి
యోగమూనవలెన్ ॥

12. మనసు నేకాగ్రముగ జేయుచు
నియత చిత్తేంద్రియక్రియుడై
యంతరంగవిశుద్ధి నాత్మ
ధ్యాన మొనరించున్

13. కాయ కంఠశిరమ్ము లొకగతి
నిల్పి నిశ్చల స్థిరాసనుడై
దృష్టి నాసాగ్రమున నిల్పుచు
యోగ మూనవలెన్

14. శాంతచిత్తుడు భయవిదూరుడు
బ్రహ్మచారియు సంయమీంద్రుడు
మద్గతాత్ముడు మత్పరుండై
యోగమున నెగడున్

15. నియతమానసుడైన సమ్మౌని
సతత మాత్మధ్యానమతియై
మత్స్వరూపంబైన పరమా
నందసంస్థితి నందెడున్

16. మిగుల నధికము మిగుల నల్పము
తిండి నిదురల నందువారలు
ధ్యానయోగస్థితిని బొందరు
నియమములు లేమిన్

17. మితాహార విహార చేష్టలు
యుక్త నిద్రా ప్రబోధంబులు
నల్పువారలు కర్మలందున
యోగు లౌదురు పాండవా !

18. ఆత్మ సంస్థిత నియతచిత్తుడు
సర్వ కామవికారదూరుడు
యోగసిద్ధుం డనఁగ బరగును
పరమశాంతుండై

19. ఇల నివాతస్థిమిత దీపము
పోలి నియమిత మానసమ్మది
యాత్మ ధ్యానమునందు స్థిరమౌ
దాన దీపసదృశ్యమౌ

20. యోగమందు విశుద్ధచిత్తం
బుపరతంబై స్వస్వరూపము
గాంచి పరమానందపూర్ణమౌ
సమాధిస్థితి నందెడిన్

21. ఇంద్రియాదుల కగోచరమును
శుద్ధబుద్ధిగ్రాహ్యసాధ్యము
ననంతాత్మానందతుందిల
మాత్మయోగము భారతా!

22. అందు నచలస్వామభవమున
నన్యసౌఖ్యం బల్పతమమని
యోగి దుఃఖమునందుపైతము
విచలితుడుగా డర్జునా!

23. నిర్మలాత్ముడు నిశ్చితుండై
అసంశయ మవ్యాకులంబును
దుఃఖబంధచ్ఛేదకము నీ
యోగమును బొందున్

24. సకల సంకల్పాభిమతముల
నశేషంబుగ విడచివైచిన
విజిత విషయానందమతియై
యోగమున నెగడున్

25. క్రమముగను స్వాత్మావలంబన
నన్యచింతన మానిశాంతితో
నాత్మరమణానందమతియై
యోగి వరులను వల్గనా!

26. అస్థిరమ్మును చంచలమ్మగు
మనము విషయమున ండి మరలిచి
మలచి యాత్మకు నంకిత మ్మిడు
యోగి యోగమునన్

27. శాంతచిత్తుడు శాంతరజనుడు
బ్రహ్మభూతు డకల్మషుడు నౌ
యోగి నిరతిశయాత్మసుఖమును
పొందు శీఘ్రమె ఫల్గునా!

28. చిత్త మాత్మార్పణము జేసిన
విగతకల్మషుడైన యోగియె
శ్రేష్ఠమాత్మానందసౌఖ్యముఁ
బొందు యోగఫలంబుగన్

29. యోగి సమ్యగ్దర్శనంబున
తనను భూతము లన్నిటను మరి
జీవజాలమునంత తనలో
గాంచు నిత్యసమైక్యతన్

30. అన్ని జీవులయందు నన్నును
ప్రాణికోటుల నెల్ల నాలో
గాంచు వాతని కేను నిత్యుడ
నాకు నాతడు నిత్యుడౌ

31. సర్వభూతస్థితుని నన్నెక
తభేదాత్మగ గొలుచు నిచ్చలు
నాత డేయోగమ్మునను న్నను
మందు నాయందర్జునా !

32. ప్రాణులన్నిటి కష్టసుఖములు
స్వాత్మతోడను బోల్చి సమముగ
గాంచు యోగియె శ్రేష్ఠతముడై
వరలు నీధర భారతా !

అర్జునుడనెను :-

33. నీవు చెప్పెడి ధ్యానయోగము
మనస్సామ్యముచేత సాధ్యము
చంచలాత్ముడ దీని స్థైర్యము
నెరుగలేకుంటిన్

34. చంచలము నిర్మథనశీలము
అమితబలవత్ దృఢతరంబౌ
మానసమ్మును నిగ్రహించుట
గాలి నణచుటవోలె దుష్కర
మంచునే దలతున్

భగవానుడు చెప్పెను :-

35. మనసు దుర్నిగ్రహము చంచల
మనుట నిస్సంశయము పార్థా!
ఐన సాధన విరాగములచె
మతిని గెలువగ సాధ్యమౌ

36. మనోనిగ్రహ మేమిలేకయు
యోగ మబ్బదు పార్థ! కుశలుడు
నుపాయముచే గెలువగలుగుట
సాధ్యమే యని యెంచెదన్

అర్జునుడడిగెను :-

37. శ్రద్ధయుండియు నియతచిత్తుడు
యోగభ్రష్టుడైనయత్తం
యోగసిద్ధిని బొందకున్నచొ
పొందు నేగతి మాధవా?

38. యోగమం దస్థిరుడు మూఢత
నిహపరంబుల జెడినవాడై
ఛిన్నమేఘమువోలె నాశన
మందడా కృష్ణా?

39. నాదు నీసంశయము పూర్తిగ
దీర్ప నన్యులు లేరు మాధవ
తన్నివృత్తికి నీవ తగుదువు
దయను గనుమయ్యా!

భగవానుడుచెప్పెను :—

40. యోగభ్రష్టుం డుభయలోకము
లందునన్నాశమును బొందడు
ధర్మకర్మాచరణశీలుడు
దుర్గతిం గన డర్జునా ।

41. చనిన తదుపరి యోగపతితుడు
పుణ్యలోకావాప్తినొందును
అచట బహువర్షములు గడపియు
శుద్ధుడౌ శ్రీమంతునింటను
జననమందు ధనంజయా ।

42. శ్రేష్ఠమైనదౌ భ్రష్టయోగియు
జ్ఞానయోగికి నాత్మజుండగు
నట్టిజన్మము లోకమందున్ను
దుర్లభం బగు భారతా ।

43. జ్ఞానివంశంబందు బుట్టిన
పూర్వభవ సంస్కారవశమున
తీవ్రతరముగ మోక్షసిద్ధికి
యత్న మొనరించున్

44. యోగపతితుడు భావితమ్మున
పూర్వజన్మపు వాసనలచే
కోరినంతనె యప్రయత్నము
యోగసిద్ధిని గాంచెడిన్

45. చలమునను యత్నించుచున్నదో
పాపదూరుండై ననన్ముని
జన్మసిద్ధాభ్యాసవశమున
యోగసిద్ధిని నందెడున్

46. తపసికన్నను జ్ఞానికంటెను
ధర్మకర్మాచరణుకంటెను
యోగియే యత్యధికశ్రేష్ఠుడు
యోగివై మను మర్జునా।

47. యోగులం దనిశమ్ము మద్గత
మానసుండై భక్తిశ్రద్ధల
సేవ జేసెడివాడె యిక్కలి
శ్రేష్ఠతము డిల కవ్వడీ।

శ్రీమద్భగవద్గీతాసుధామాధురి–ఆత్మసంయమ
యోగము షష్ఠాధ్యాయము



# 7వ అధ్యాయము - విజ్ఞానయోగము.

1. మద్గతాశ్రియమానసుడవై
ధ్యానయోగసమాధిమగ్నత
నసంశయపరిపూర్ణసుస్థితి
నన్నెరుంగువిధమ్ము దెల్పెద
సావధానత వరయుమా!

2. దీని నెరిగిన నిహమునందున
దెలియ నింకేమియును మిగులదొ
అట్టి యనుభవసహితజ్ఞాన
మంత తెల్పెద నర్జునా!

3. వేల మనుజులలోన గొందరె
మోక్షయత్న మొనర్తు రందున
నేరొకండో వాస్తవంబుగ
నన్నెరుంగు ధనంజయా!

4. భూమి సలిలం బనల మనిలము
ఖం మనో బుద్ధ్యహంకారము
లనగ నాయది ప్రకృతి యెన్మిది
విధములగు పార్థా!

5. అది మదీయము ప్రకృతి యపరము
అన్య దన్యము పరమమైనది
జగద్ధార్యము జీవరూపము
శ్రేష్ఠ మయ్యది కారకా!

6. జీవజాలం బంతయును నీ
రెండు ప్రకృతులనుండి పుట్టు
జగ త్ప్రభవ ప్రళయములకే
నగుదు మూలం బర్జునా !

7. నాకు పర మితరమ్ము లే దిల
సూత్రమందున మణిగణమువలె
అన్ని నాయం దమరియున్నవి
సత్య మది పార్థా !

8. సూర్యచంద్రులయందు కాంతిగ
వేదమున నోంకార మాకా
శమున శబ్దము నీట రసముగ
పురుషులందున పౌరషంబుగ
నేనె యుంటిని కారణా !

9. భూమి గంధము నగ్ని తేజము
సకలప్రాణులయందు జీవము
తాపసులలో తపము నేనై
నిండియున్నా నన్

10. సర్వభూతమ్ములకు బీజము
బుద్ధిమంతులలోన బుద్ధియు
దీప్తివంతులలోన దీప్తియు
నగుచు వెలయుదు నర్జునా !

11. కామరాగవివర్జితాత్ముల
శక్తిసామర్థ్యములు నేనె
ప్రాణులందరి ధర్మకామము
నేనె తెలియుము కవ్వడీ

12. సత్వ రాజస తామసోద్భవ
సర్వవస్త్వాధారభూతుడ
త్రిగుణములు నావశము అర్జున!
నేను నిర్గుణుడన్

13. గుణ వికార స్వభావములచె
లోకు లెల్లరు మోహమతులై
అవ్యయాత్ముని గుణాతీతుని
న న్నెరుంగరు మూఢతన్

14. గుణమయంబును దివ్యమగు నా
మాయ దాటుటకష్టమైనను
మదాశ్రయుడౌ జనుడు లీలగ
మాయజలధి తరించెడిన్

15. పాపకర్ములు మూర్ఖచిత్తులు
పరికృత్యపహృతవివేకాత్ములు
అమరభావులు పదము లెన్నడు
నన్ను బొందరు ఫల్గునా!

16. ఆపదలలో నున్న జనుశును
జ్ఞానకాంక్షియు సర్థకాముడు
ఆత్మజ్ఞాని యనంగ నల్వురు
నన్ను గొల్తురు పాండవా!

17. అందు నిత్యం బాత్మమగ్నుడు
ఆత్మ యందురు భక్తినిష్ఠుడు
శ్రేష్ఠు డర్జున! నాకు ప్రియతము
డేను వానికి నిష్ఠుడన్

18. నలుగురును సుధ్భక్తవరులే
మదర్పిత స్థిరమానసుండై
పరమగతి యని నన్నె గొలిచెడి
జ్ఞాని సాక్షాత్ నేనెసుమ్మా
సత్య మిద్ది పరంతపా

19. పేల జన్మల యంతమందున
వాసుదేవుడె సర్వ మనియొటి
జ్ఞాని నన్నే బొందు కానీ
వార లరుదయ్యా!

20. పూర్వజన్మల వాసనలచే
విషయవాంఛలులేని విజ్ఞులు
తగిన నియతిని యన్యదేవుల
నాశ్రయింతురు భక్తులై

21. ఎట్టిరూపము నెట్టి భక్తుడు
శ్రద్ధగా బూజింపగోరునొ
వాని కెప్పుడు నట్టి శ్రద్ధనె
స్థిరము జేతును ఫల్గునా !

22. కామ్యభక్తుడు భక్తిశ్రద్ధల
నిష్టదైవార్చనల జేసిన
నే విధించిన ఫలమె పొందును
తనదు దైవము చేత

23. అల్పమతులౌ భక్తులాయా
దేవతాత్ముల నందుచుందురు
తత్ఫలమ్ములశాశ్వతమ్ములు
నాదు భక్తులు శాశ్వతమ్ముగ
నన్నె పొందుదు రర్జునా !

24. ఉత్తమోత్తమ పరమ మవ్యయ
మైన నా నిజరూపమెరుగని
యజ్ఞు లవ్యక్తాత్ము నన్నొక
వ్యక్తు డందురు భారతా !

25. యోగమాయావృతుడనగుటను
అందరకు నే గానుపింపను
అజవు నవ్యయుగా నెరుంగరు
నన్ను మూఢులు ఫల్గునా !

26. భూత వర్తభవత్ భావిజీవుల
వన్నిటిని నే నెరుగు దర్జున
నన్ను మాత్రం బెవ్వరేనియు
నెరుగజాలరు భారతా!

27. జన్మతోడనె సర్వప్రాణులు
రాగద్వేషజమైన సుఖదుః
ఖాది ద్వంద్వము లనెడి మోహము
నందుచున్నవి యథార్థముగన్

28. పుణ్యకర్మాచరణ శీలురు
ద్వంద్వ మోహ విముక్తచిత్తులు
పాపదూరులు దృఢవ్రతులై
నన్నె కొల్తురు ఫల్గునా!

29. జరామరణవిముక్తికాంక్షను
మదాశ్రయులౌ యోగు లెరుగుదు
రఖిలజీవులు సర్వకర్మలు
ప్రత్యగాత్మ స్వరూప మంతయు
బ్రహ్మమే యను సత్యమున్

30. ఉత్తమోత్తమ సాధకుం డిల
కర్మమును, దైవంబు, యజ్ఞము
నన్నుగానే యెరిగి చివరను
నన్నె పొందును ఫల్గునా!

శ్రీ మద్భగవద్గీతా సుధామాధురి — సప్తమాధ్యాయము
విజ్ఞానయోగము

# 8వ అధ్యాయము-అక్షరపరబ్రహ్మయోగము

అర్జునుడడిగెను :-

1. ఏది బ్రహ్మం బేది కర్మం
బేది యధ్యాత్మమ్ము నాబడు
నేది దైవం బేది భూతం
బెరుకపరపుము కేశవా!

2. దేహమం దధియజ్ఞ డనగా
డెవడు? నెట్టులనుండు? నిగ్రహ
దంత్యమున నిన్నే విధంబున
దెలియగాగలడచ్యుతా!

భగవానుడుపల్కెను :-

3. నాశరహితము సర్వశ్రేష్ఠము
బ్రహ్మమనబడు,స్వభావము నీ
ధ్యాత్మ మనబడు సృష్టికొఱకౌ
యోగ మది క్రియ కర్మ యౌ

4. నశ్వరం బధిభూత,మధిదై
వతము పూరుషు, డఖిల దేహము
లందు వర్తిలు నాత్మనే యధి
యజ్ఞుడందురు పాండవా!

అంత్యకాలమునందు కూడను
నన్నె సంస్మరణంబు జేయుచు
వొడలు వదలెడి యోగి నన్నే
పొందు సత్యము భారతా!

6. మరణకాలంబందు నరుడే
రూపమును జింతించుచుండునో
చిత్తసంస్కారమ్ముచేతను
దాని బొందెడి నర్జునా!

7. అందుచే నెల్లపుడు నన్నే
సంస్మరించుచు ననిం జేయుము
మనో బుద్ధుల నాకొసంగుము
నన్నె పొందెదు నిత్యమున్

8. సంతతాభ్యసనాత్మకుండగు
యోగి సాధన నన్యమెంచక
ఆత్మచింతనమగ్ను డగుటను
నాత్మనే పొందున్

9. సర్వదర్శి పురాణు శాసకు
సృష్టికరుని యచింత్యరూపుని
సూర్యతేజు నణోరణీయుని
పరమభక్తి భజింపుమా!

10. అంత్యకాలమునందు నిశ్చల
బుద్ధియోగబలాన నతతము
బొమలనడుమను ప్రాణముంచిన
యోగి, యాత్మనె పొందెడిన్

11. వేదవేత్తలు రాగరహితులు
బ్రహ్మచారులు యతులు నెవ్వని
బొందగోరెద రట్టియాత్మని
పదము దెల్పెద నర్జునా!

12. ఇంద్రియమ్ముల నిగ్రహించియు
మనసు హృదయమునందు నిలిపియు
బ్రహ్మరంధ్రమునందు ప్రాణము
నిల్పి ధారణ జేయుచున్

13. ప్రణవమంత్రో చ్చారణమ్మున
సంతతము నన్నే స్మరించుచు
దేహమును త్యజియించి యోగులు
మోక్షమందుదు రర్జునా!

14. అన్యచింతనలేక నన్నే
సతము సంస్మరణమ్ము జేసెడి
నిత్యయోగానందచిత్తులు
నన్ను పొందుదు రశ్రమున్

15. పరమమోక్షముగాంచు నుత్తమ
జ్ఞాని బ్రహ్మత్వమును పొందిన,
దుఃఖనిలయము నశ్వరమ్మగు
జన్మమందడు పాండవా!

16. బ్రహ్మలోకము వరకుఁ గల
యెట్టిలోకము ప్రాప్తమైనను
జన్మ తప్పదు. నన్నె పొందిన
జన్మ ముండదు పాండవా !

17. వలువకునురే పగలు కలిసిన
రెండువేల యుగాల పరిమితి
దీని నెరిగినవా రహోరాత్రిక
కాలతత్త్వ విశారదుల్

18. బ్రహ్మదివసారంభమందున
ప్రకృతిజమ్మౌ సృష్టి వెలియును
రేయి రాగనె ప్రకృతియందే
లీనమై యణగున్

19. పూర్వకల్పపు ప్రాణికోటియె
కర్మభావములెన్నొ పొందియు
రేయిమొదట లయించి యుదయమె
మరల జన్మించున్

20. ప్రకృతికంటెను అవ్యక్తమది
సనాతనము నతీంద్రియమ్మగు
సర్వజీవులు నాశమైనను
నశించిపోవదు ఫల్గునా !

21 దీని విజ్ఞు లగోచరం బవి
నాశి, పరమోత్కృష్ట, మందురో
దీని పొందిన భవహరమ్మగు
పట్టి యాత్మను నేనెనూ

2 ఎవనియందువ ప్రాణు లన్నియు
వ్యాప్తమందుచు నుందుచున్నవో
ఆపరాత్ముఁడు రచంచలుడుడు
భక్తసులభుడు ఫల్గునా!

23. ఎవుడు పోయిన జన్మమ్మందడొ
ఎవుడు గిట్టిన మరల పుట్టడొ
అట్టి కాలవిశేష మట్టిన
తెల్పెదను వినుమా!

24. అగ్నియును జ్యోతియును పగలును
శుక్లపక్షము నుత్తరాయణ
పథమునం జను బ్రహ్మవిదు డా
బ్రహ్మముననె పొందున్

25. పొగయు రాత్రియు కృష్ణపక్షము
దక్షిణాయనమందు చనియోడి
యోగి చంద్రుని కాంతి పొందియు
తిరిగి జన్మము పొందెడిన్

26\. శుక్ల కృష్ణపథంబు లియ్యవి
శాశ్వతంబులు వందు శుక్లము
జన్మరహితము నన్యమార్గము
జన్మదము పార్థా ।

27\. రెండుమార్గము లెరిగి యోగులు
మోహ మందరు సుంతయేనియు
కాన సతతము యోగయుక్తుడ
పై మెలంగుము కుశలివై ।

28\. వేదములు యజ్ఞములు దానము
తపములం గను పుణ్యఫలమును
మించు ఫలమౌ ఆద్యబ్రహ్మము
బొందు యోగియు సఫలుడై ।

శ్రీమద్భగవద్గీతాసుధామాధురి-అక్షరపరబ్రహ్మ
యోగము అష్టమాధ్యాయము.



# 9వ అధ్యాయము రాజవిద్యా రాజగుహ్య యోగము

1. అశుభ భవబంధముల ద్రెంచెడు
గుహ్యతమవిజ్ఞానతత్త్వము
నీవు ననసూయుండ వగుటను
దెలియ నెరిగింతున్

2. శ్రేష్ఠతమ మతిగుహ్య మవ్యయ
ముత్తమము ధర్మ్యము పవిత్రము
సులభసాధ్యము నాత్మవేద్యము
బ్రహ్మవిద్య యిలన్

3. భక్తిశ్రద్ధల నాత్మవిద్యను
ననుష్ఠింపని జనులు పార్థా!
నన్ను బొందక మునగిపోదురు
మృత్యుసంద్రమునన్

4. ఇంద్రియమ్ముల కగోచరుడను
సకలభూతాధారపురుషుడ
నఖిలజగముల వ్యాప్తిజెందియు
నందు లేకుంటిన్

5. భూతములు నాయందు నుండవు
నాకు నాధారములు కావవి
యెల్లప్రాణుల సృజన పోషణ
మన్న దీశ్వరయోగమహిమగ
దెలియు మోపార్థా!

6. సర్వగతమగు మహావాయువు
నాకసమ్మున నమరియుండును
అటులె సర్వప్రాణికోటియు
నుండు నాయందున్

7. ప్రళయమందున జీవు లన్నియు
నాదు ప్రకృతిని నణగియుండును
సృష్టిసమయమునందు మరలను
సృజన మొనరింతున్

8. అస్వతంత్రపు జీవజాలము
మాయవశమై యుండుకతమున
స్వీయమాయాధారమున పలు
మారు సృజియింతున్

9. సృష్టి మొదలగు కర్మలందున
ననాసక్తుడ సాక్షిమాత్రుడ
నగుట నా కాకర్మ లేవియు
బంధములుగా వర్తునా!

10. నేనె యధ్యక్షునిగ మాయచె
నీచరాచరసృష్టి జరుపుడు
కావునసె యీ జగము పర్తిలు
నెపుడు నీసరణిన్

11. సర్వభూతమహేశ్వరాత్మక
దివ్యలీలా దేహనగు నను
మూఢులవమానించుచుందురు
పరబ్రహ్మగ నెరుగమిన్

12. వ్యర్థకాములు వ్యర్థకర్ములు
జ్ఞానశూన్యులు బుద్ధిహీనులు
రాక్షసాసురస్వభావమునే
యాశ్రయింతురు భారతా!

13. సాత్వికుల భువి దైవగుణముల
నాశ్రయించి సమస్త ప్రాణుల
కాదికారణు నవ్యయునిగా
నన్నెరింగి యనన్యచింతన
భజనసేయుదు రర్జునా!

14. దృఢవ్రతులై వారు సతతము
భక్తి బ్రణుతుల గీర్తనంబుల
వర్చనల నేకాగ్రభావన
నుపాసింతురు ప్రపన్నులై

15. జ్ఞానయజ్ఞముచేత నద్వై
తాత్మ గొందరు, ద్వైతభావన
గొందరును విశ్వాత్మ నను సే
వింతు బహుగతులన్

16. నేనె క్రతువును, నేనె యజ్ఞము
నేనె స్వధ నౌషధము నేనే
నేనె మంత్రము నాజ్యమగ్ని ని
నేనె హుతమును, ఫల్గునా !

17. తల్లిదండ్రులు తాత ధాతలు
వేద్యమును పావనము ప్రణవము
ఋగ్యజుస్సామములు నేనే
నేనె హుతమును కవ్వడీ

18. గతిన పతి నేప్రభుడ సాక్షిని
స్థానమును శరణమ్ము హితుడను
సృష్టిస్థితిలయకర్త నవ్యయ
బీజమును నిధి నేనెనూ

19. నే తపింపగజేతు, వర్షము
కురియజేసెద, నాపుచేయుదు
నేనె సదసద్వస్తుజాలము
మరణమమృతమున్

20. వేదవేత్తలు స్వర్గకామన
యజ్ఞములచే నన్ను గొలిచియు
సోమపీథులు పాపదూరులు
పుణ్యలభ్యము లమరభోగము
లనుభవింతురు ఫల్గునా !

21. స్వర్గసుఖముల ననుభవించిన
క్షీణపుణ్యుడు జగతి బుట్టును
కామ్యకర్ములు త్రియీధర్ముల
భవము లందుదు రెప్పుడున్

22. అన్యచింతనలేక సతతము
న న్ప్రవృత్తితో నుపాసించెడి
సత్యనిష్ఠుల యోగక్షేమ
ముల్ వహింతును భారతా!

23. అన్యదైవము నిలను భక్తి
శ్రద్ధలను పూజించు భక్తులు
కూడ కొల్తురు నన్నె కానీ
యవిధిపూర్వముగన్

24. ఏలయన నే యజ్ఞపురుషుడ
యజ్ఞభోక్తను యథార్థమ్ముగ
నన్నెరుంగక, నన్యచిత్తులు
పొందుచుందురు జన్మలన్

25. దేవతల నటు పితరులను మరి
భూతముల నర్పించుచున్న జో
ఎవని దేవత నతడు పొందును
అన్యమెన్నక నన్నె కొలచిన
నన్నె పొందును పాండవా!

26. విజ్ఞుడా శుద్ధాంతరంగుడు
దళము పుష్పము ఫలము నుదకము
భక్తి నొవగిన బ్రీతి గైకొని
యారగింతును ఫల్గునా !

27. కర్మ దానాశనము తపములు
నాదిగాగల సర్వచేష్టలు
నాకు నర్పణజేయు మెప్పుడు
నన్నె పొందెద వర్జునా !

28. "భగవదర్పిత కర్మ" మను న
య్యోగబలమున పాపపుణ్యపు
కర్మబంధవిముక్తి నందెదు
నన్నె పొందెద వర్జునా !

29. సర్వప్రాణులయందు సముడను
నాకు నిష్టు లనిష్టు లుండరు
నేను భక్తులలోన నాలో
వారు నుందురు పాండవా !

30. అమితదుష్టాచారుడైన న
నన్యభక్తిని నన్ను గొలిచిన
నిశ్చలాత్మకుడగుట నాతడు
శిష్టు డని యెంతున్.

31. అతడు శీఘ్రమె సాధువై మను
బడయు శాశ్వత శాంతపదవిని
నాదు భక్తుడు చెడ డటంచును
చాటి చెప్పుదు ఫల్గునా

32. హీనకులజులు పాపకర్ములు
ఎవ్వరైనను మదాశ్రియులై
నన్భజించిన మోక్షపదవిని
పొంది తీరుదు రర్జునా !

33. పుణ్యబ్రాహ్మణ రాజ ఋషిభ
క్తులను వేరుగ జెప్పనేలా !
అనిత్యము నసుఖమ్ము భవ మిది
యోగివై నను బొందుమా

34. బుద్ధి నాయందుంచి భక్తిని
నర్చనల ప్రణతుల భజింపుము
మత్పరాయణధ్యానమతివై
నన్నె పొందుము ఫల్గునా

శ్రీమద్భగవద్గీతా సుధామాధురి - నవమాధ్యాయము
రాజవిద్యారాజగుహ్యయోగము.

# 10వ అధ్యాయము - విభూతియోగము

భగవానుడు తెల్పెను :

1. ఇంతదనుకను నాదు బోధల
సంతసించుచు వింటి వర్జున
నీకు హితమును శ్రేష్ఠమౌ వర
మార్ధవచనము తెల్పెదన్

2. దేవతలు మునిశ్రేష్ఠు లెవరును
నాదు ప్రభవం బెరుగనేరరు
ఋషులకును దేవతల కందర
కాద్యుడను నౌటన్

3. నన్ను నభవు ననాదిలోక మ
హేశ్వరునిగా నెరుగు నాతడు
మనుజులందున విజ్ఞుడై పా
పమ్ము లన్నియు బాపెడిన్

4. బుద్ధియును జ్ఞానమ్ము సత్యము
నసమ్మోహము వోర్పు శమదమ
ములును సుఖదుఃఖములు జననము
మరణమును భయ మభయమున్

5 సమత తృప్తి యహింస తపమును
దానమును యశ మపయశమ్మును
గుణము లన్నియు జీవులకు నా
వలన కలుగును తారకా !

6 సప్త ఋషులును, దేవమునులును
మనువులును మద్భావయుతులై
యుద్భవించిరి నాతలంపున
వారి సంతతి యీపృథివిజల్

7 మద్విభూతియు యోగ మెవ్వడు
యదార్థముగా నెరుఁగగమనో
అతడె నిస్సంశయముగా స్థిర
యోగయుక్తుడు ఫల్గునా !

8 నేను జగదుత్పత్తి కరుడను
నేనె సర్వము నడుపుచుంటిని
దీని నెరిగిన బుధులు నిత్యము
నన్నె కొలుతురు భక్తిమై !

9 మద్గతప్రాణులును భక్తులు
నన్ను గూర్చియె ముచ్చటించుచు
నిత్యతృప్తానందతుందిల
చిత్తు లౌదురు పాండవా !

10 ప్రీతిపూర్వక మన్మనస్కుడు
భక్తి నన్నర్చితుని జేయగ
నన్ను పొందెడి జ్ఞానయోగము
ప్రసాదింతును భారతా !

11 కరుణచే సద్భక్త హృదయము
నందు కొలువై వెలయుజేయుదు
జ్ఞానదీపము, దాన నజ్ఞా
నాంధకారము బాపెదన్

అర్జునుడు పలికెను :-

12 పరబ్రహ్మము పరంధాముడు
నతిపవిత్రుడు శాశ్వతాత్ముడు
దివ్యపురుషుడు నాదిదేవుడు
అజుడు విభు డంచున్

13 నిన్ను ఋషులును నారదుండును
నసితుడును దేవలుడు వ్యాసుడు
సంస్తుతింతురు నీవు నటులే
పలుకుచుంటివి కేశవా !

14 నీవు చెప్పినదెల్ల నిజమని
నమ్ముచుంటిని నీస్వరూపము
దానవులు దేవతలు సైతము
తెలియనేరరు మాధవా

15 యదార్థమ్ముగ నిన్ను నీవే
యెరుగు దంతియ పురుషోత్తమ
భూతభావన జీవపాలక,
దేవదేవ జగత్పతే !

16 లోకముల నేవిభూతులచే
వ్యాప్తిగాంచితి వట్టినీ ది
వ్యాత్మభూతుల నశేషంబు న
నుగ్రహింపు త్రివిక్రమా !

17 సతము నిన్ను రచింతజేయుచు
నిన్నెరుంగుట యెట్లు భగవాన్
ఎట్టి వస్తువులందు నిను ధ్యా
వించగావలె మాధవా !

18 భవ ద్యోగవిభూతు లఖిలము
విస్తరంబు ననుగ్రహింపుము
నీదు వాక్సుధ నెంతగ్రోలిన
దనివితీరదు శ్రీధవా !

భగవానుడనెను :-

19 నాదు దివ్యవిభూతు లన్నియు
యథాప్రాధాన్యముగ దెల్పెద
నాదు వైభవవ్యాప్తి కెందును
వంతమేలే దర్జునా !

20 సర్వప్రాణి హృదంతరమ్ముల
ప్రత్యగాత్మగ నేనె యుందును
ఆదిమధ్యాంతములు నేనే
ప్రాణు లన్నిటికిన్

21 విష్ణువును నాదిత్యులందున
సూర్యుడను జ్యోతిస్సులందున
మరీచిని మారుతులయందున
శశిని తారలయందునన్ :

22 వేదముల నే సామవేదము
సురలయందున వాసవుండను
నింద్రియమ్ముల మతిని జీవుల
తెలివి నే పార్థా :

23 రుద్రులందున శంకరుండను
యక్షరాక్షసులందు ధనదుడ
వసువులందున నగ్ని గిరులను
మేరువును విజయా :

24 పురోహితముఖ్యులం గురుడను
దేవసేనాపతుల స్కంధుడ
సారసంబుల నుత్తమం బగు
సాగరంబును నరుడా :

25 మహర్షుల నే భృగుడ వాక్కుల
ప్రణవమును యాగముల జపమును
స్థావరమ్ముల హిమాలయమై
తనరుచున్నాడన్

26 వృక్షముల నశ్వత్థమును నే
దేవమునులను నారదుడ గం
ధర్వులందున చిత్రరధుడను
సిద్ధులందున కపిలుడన్

27 మనుజులందున చక్రవర్తిని
అశ్వముల నుచ్చైశ్రవంబను
గజేంద్రుల నైరావతము నివి
పుట్టి సుధతోడన్

28 ఆయుధంబుల వజ్రమును ధే
నువులయందున కామగవినే
ప్రజనులందున మన్మధుండను
సర్పములలో వాసుకిన్

29 అనంతు డనే నాగులందున
వరుణుడను జలదైవతమ్ముల
పితరులందున నర్యముం డను
యముడ సంయములందునన్

30 దైత్యులందున ప్రహ్లాదుడను
గణకులందున కాలమును జం
తువులయందున సింహమును నే
పక్షులందున గరుడుడన్

31 పావనంబుల వాయుదేవుడ
శస్త్రభృతులను రామచంద్రుడ
మత్స్యములలో మకరమును నే
నదులయందున గంగ నేన్

32 సృష్టిసంస్థితి లయకరుండను
విద్యలందున నాత్మవిద్యను
తత్త్వనిశ్చయవాదులందున
వాదపటిమను కవ్వడీ

33 అక్షరంబుల "అ" కారంబును
సమాసమ్ముల ద్వంద్వమును నే
విశ్వతోముఖ విరాట్పురుషుడ
కాలమున కే కాలమున్

34 కాలకాలుడ సర్వహరుడను
పుట్టబోయెడివారి జన్మము
స్త్రీలకీర్తిని సిరిని వాణిని
స్మృతిర్మేధా ధృతిక్షమలును
నేనెసూ పార్థా

35 సామములనే బృహత్సామము
ఛందముల గాయత్రిమంత్రము
మాసములలో మార్గశీర్షము
ఋతువులందు వసంతుడన్

36 వంచకమ్ముల జూదమును నరు
తేజమును తేజస్వులందున
జయము వ్యవసాయమ్ము నేనే
సాత్త్వికాత్ముల సత్త్వమన్

37 వృష్ణులందున వాసుదేవుడ
పాండవులలో ధనంజయుడను
మునుల వేదవ్యాసమౌనిని
కవుల శుక్రుడ ఫల్గునా!

38 శాసకుల దండనము నేనే
జిగీషుల విజయమ్ము నేనే
గోప్యముల మౌనంబు నేనే
జ్ఞానవంతుల జ్ఞాన మేన్

39 సర్వజీవుల మూలకారణ
మేనె ఫల్గున వేయునేలా
నేను లేనిచో సృష్టి యంతయు
వరలజాలదు పాండవా!

40 నాదు దివ్యవిభూతి కంతము
లేదు ఫల్గుణ యందు కొన్నిటి
క్లుప్త వివరణ దెల్పినాడను
దెలియుమోపార్థా !

41 భాగ్యవంతము కాంతివంతము
శక్తివంతము లైనవన్నియు
నాదు తేజోంశములె పార్థా
తెలిసి వానిగ్రహింపుమా ॥

42 సవిస్తరమౌ మద్విభూతి
జ్ఞానమంతయు నెరుగు మైనను
నాదు నేకాంశమ్ము చేతనె
లోకమంతయు నిల్పితిన్ ॥

శ్రీమద్భగవద్గీతా సుధామాధురి - దశమాధ్యాయము
విభూతియోగము.



# 11వ అధ్యాయము విశ్వరూప సందర్శనయోగము

అర్జునుడు పలికెను :-

1 నీయనుగ్రహ మెసగ పరమము
గుహ్యమును నధ్యాత్మికము నా
బోధ నందితి దాన మోహము
పూర్తిగా దొలగెన్

2 కమలనేత్రా నీదు కరుణను
భూతముల యుత్పత్తినాశము
నవ్యయంబగు నీదు మహిమ న
విస్తరంబుగ నెరిగితిన్

3 నిన్ను గూర్చిన నీదుభాషణ
నిత్యసత్యము పురుషోత్తమ
నీదు నైశ్వర్యంపు రూపము
జూడగోరెద కేశవా !

4 నీస్వరూపము జూడ నాకును
శక్యమగునని నీవు దలచిన
అవ్యయము నీవిశ్వరూపము
జూప వేడెద మాధవా !

భగవానుడిట్లనెను :-

5 బహువిధములు వలౌకికములౌ
వివిధ వర్ణాకారములుగల
శతసహస్రములైన నావగు
రూపముల గను మర్జునా !

6 రవులు వసువులు రుద్రు లశ్వను
లమరు లందరు మరుత్తులు నీ
వెపుడు జూడని యద్భుతావహ
మైన వెన్నియొ చూడుమా ॥

7 ఈచరాచర నిఖిలలోకము
గాక యింకను గాంచదలచిన
వాని నీదేహమున నిప్పుడె
చూడు మొక్కెడ నర్జునా ॥

8 చర్మచక్షుల విశ్వరూపము
జూడ జాలవు దివ్యదృష్టిని
ప్రసాదింతును కనుము నాదై
శ్వర్యయోగంబున్

సంజయుడు చెప్పెను :-
9 కౌరవేశ్వర యీవిధంబుగ
బలికి యోగీశ్వరుడు కృష్ణుడు
పరమ మీశ్వరవిశ్వరూపము
దర్శనం బొసగెన్

10 పెక్కుముఖములు నేత్రములు గల
అనేకాద్భుత విషయదర్శన
మధిక దివ్యాభరణ మాయుధ
కలితమౌ మూర్తిన

11 దివ్యమాల్యాంబరధరమ్మును
దివ్యగంధానులేపనంబు, న
నంత దివ్యము విశ్వతోముఖ
విశ్వరూపము జూపగన్

12 ఆకసంబున శత సహస్రము
భాస్కరద్యుతి యుగపదుత్థిత
కాంతియో యన నాపరాత్పరు
తేజ మగుపించెన్ ।

13 అంత నర్జును డనేకంబగు
విభజనాత్మక విశ్వమును నా
దేవదేవుని దేహమందున
గాంచె నేకస్థమ్ముగాన్

14 విస్మయాత్ముడు హృష్టరోముడు
విజయు డంతట విశ్వమూర్తికి
శిరముచే ప్రణమిల్లి పలికెను
కృతాంజలియై :
అర్జునుడు పల్కెను :-

15 దేవ గాంచుచునుంటి నీదగు
దేహమున సుర సంఘముల
వారిజాసను, నీశు, ఋషులను
దివ్యసర్పములన్

16 నిన్ను నెల్లెడ బెక్కుచేతుల
నుదరములు ముఖములును కనులును
గల్గు విశ్వ ననంతు గాంతును
ఆదిమధ్యాంతములు మాత్రము
గానలేకుంటిన్

17 కిరీటమ్మును గదను జక్రము
బూని యంతట పరిభారాసిగ
వెలుగు వెలుగున్ను దీప్త మా యన
లార్కతేజుని యుప్రమేయుని
గాంచుచున్నాడన్

18 జ్ఞాత వక్షరవర బ్రహ్మవు
పరమ విశ్వాధార భూతుడ
వఖిల శాశ్వతధర్మ గోప్తవు
నాదిపురుషుడవున్

19 ఆదిమధ్యాంతములు లేని య
నంతవీర్యునవంత బాహుని
చంద్రభాస్కరనేత్రు బ్రజ్వలి
తాగ్నివక్త్రు స్వకీయ తేజ
స్తపన విశ్వుని జూచితిన్

20 భూమి దివి దిక్కులును సర్వము
నీవె నిండగ నీదు వద్భుత
ముగ్రరూపము జూచి జగములు
భయభ్రాంతములయ్యెడిన్

21 సురలు కొందరు నిన్ను గలియగ
నంజలింపగ భీతిగాంతురు
ఋషులు సిద్ధులు స్వస్తివాక్కుల
సంస్తుతింతురు కేశవా !

22 రుద్ర రవి వసు సాధ్య విశ్వులు
నశ్వినులు గంధర్వుల సురులు
యక్షులను సిద్ధులును గాంతురు
విస్మయేక్షణులై

23 మహాత్మా ! బహుముఖము లక్షులు
పెక్కు చేతులు దొడలు చదములు
చాలకడుపులు కోరలుంగల
నీభయంకరూపు జూడగ
భీతినొందును లోకముల్

24 నభము నంటుచు నధికవర్ణ
జ్వలితుడవునై నోళ్ళు తెరచియు
పెద్దకన్నుల జ్వాలలు మిసెడి
నిన్గనన్ ధృతి శాంతి గోల్పొది
వ్యధితమతినై తిన్

25 భయద దంష్ట్రాకరాళమ్మును
కాలవహ్నినిభమ్ము నీముఖ
తీక్ష్ణవీక్షణ విహ్వలాత్ముడ
పరిసమ్మడ వగుమా !

26 ధార్తరాష్ట్రులు భీష్మ ద్రోణులు
కర్ణుడును భూమీశు లందరు
నటులె మనసైన్యమున ప్రముఖులు
వేగ నిన్గలియన్

27 ఘోరదంష్ట్రాకరాళానన
గవ్వరాంతరమగ్ను లెల్లర
చూర్ణమానానేకశిరములు
చూచుచున్నాడన్

28 బహు నదీవాహములు సాగర
గాములై వడిచేరుకైవడి
వీరు లెల్లరు జొచ్చుచుండిరి
నీజ్వలాననమున్

29 అపరిమితవేగమున మిడతలు
జ్వలనజ్వాలికల న్నశించు
నటులె లోకము లన్ని నీముఖ
గహ్వరంబున దాహమౌ

30 జ్వలనముఖ సందీప్తి నంతను
నంతటను గ్రసియించుచుంటివి
నీమహోగ్రచ్ఛటచ్ఛటలను
దగ్ధమౌ జగముల్

31 ఉగ్రమూర్తీ ! ఎవరవయ్యా !
నీప్రవృత్తి యగమ్యగోచర
మెరుగజేయుము నీస్వభావము
దేవ ప్రణుతింతున్

భగవానుడుచెప్పెను :-

32 లోకసంహరణోద్యమాంకిత
జృంభమాణకరాళకాలుఁడ
వైరిమారణ మవశ్యం బగు
నీవు కాదన్నన్

33 లెమ్ము గాంచుము విజయకర్మల
ననుభవింపుము పూర్ణరాజ్యము
వైరులను నేనెపుడొ చంపితి
నిలుము ఫల్గుణ నిమిత్తమ్ముగ
యుద్ధరంగమువన్

34 భీష్మగురు రాధేయ సైంధవు
లందరును నాచేత నిహతులు
నిర్భయంబుగ జంపి రణమున
విజయుడవు కమ్మా !

సంజయుడుపల్కెను :-

35 కృష్ణు పల్కులు వినిన పార్థుడు
వణకుచును నంజలి ఘటింపుచు
భీతి గద్గద వినయభాషల
హరికి నిట్లనియెన్

అర్జును డనెను :-

36 లోకములు నీస్మరణమహిమను
పెరిమహర్షము లందుచున్నవి
భీతి నసురులు దెసల బారిరి
సిద్ధనుతు లెసగెన్

37 దేవదేవాక్షరానంతా :
సదసదాత్మక జగన్మూలా
పరబ్రహ్మ : దివిజవంద్యా
కొనుము కై మోడ్పుల్

38 ఆదిదేవ, పురాణపూరుష
పరంధామా : వేదవేద్యా !
పరమ విద్యాధార : వ్యాపక
పాహి గోవిందా !

39 అనిల యమ వరుణాగ్ని చంద్రులు
నజుడు దామోదరుడు నీశుడు
రవియు నీవై వెలుగు భగవన్
కోటివందనముల్

40 అమితవీర్యానంతవిక్రమ
సర్వరూపా : వ్యాపకాత్మా :
ముందు వెనుకల నన్నియాశల
శర్వ : నిను గొలుతున్

41 జగత్ప్రభువని నిన్నెరుంగక
కృష్ణ, యాదవ, సఖుడ యని పొర
బడుచు చనవుగ బిలిచితిని, ని
ర్లక్ష్యముగ దేవా !

42 పదుగురెదుటను నొంటిపాటున
నశన శయనాసనక్రీడల
మేలమాడితి నల్పబుద్ధిని
స్వామి కావగదే !

43 ఈచరాచర జగత్పతియును
గురుడు పితరుడు దైవ మీవే
నీకు సముడును నధికు డొకరుడు
లేడు జగముల మాధవా !

44 తండ్రి తనయుని హితుడు మిత్రుని
ప్రియుడు భార్యనువోలె సైషచు
కరుణనేలుము సదా వరదా
నీపదాంకితదాసుడన్

45 విశ్వరూప మదృష్టపూర్వము
సంతసంబిడె భయము గొల్పెను
సౌమ్యమౌ నీపూర్వరూపము
గరుణ జూపుము కేశవా !

46 నీమనోజ్ఞ యదార్థరూపము
కిరీటము గద చక్రధారిగ
చతుర్భుజునిగ విశ్వమూర్తీ ॥
దర్శనం బిడుమా :
భగవానుడు చెప్పెను :-

47 ఆదిమధ్యాంతములు లేని య
ఖండదీప్తము, నాన్యదృష్టము
పరమారూపము ప్రసన్నుడనై
యోగశక్తిని జూపితిన్

48 ఇట్టిదగు నావిశ్వరూపము
నీవుగా కొరు లెవరు గాంచరు
వేదయజ్ఞాధ్యయనజపదా
నాది కర్మలు జేసినన్

49 ఇట్టి ఘోరాకారముం గని
భయము మోహమ్ము నంద కర్జున
భీతివీడి ప్రసన్నమతివై
పూర్వరూపము గాంచుమా ॥
సంజయుడు చెప్పెను :-

50 ఇట్లు పలికిన వాసుదేవుడు
సౌమ్యమౌ తన పూర్వరూపము
బొంది భయకంపితుని పార్థుని
ప్రీతి నోదార్చెన్

అర్జునుడనెను :-

51 నీప్రసన్న మనుష్యరూపము
గాంచి స్వస్థత జెందినాడను
కుదుటబడినది మనసు మాధవ !
ధన్యతను గంటిన్

భగవాన్ :-

52 నీవు జూచిన విశ్వరూపము
జూచుటకు నత్యంత దుర్లభ
మమరులును నెల్లపుడు గాంచగ
దపనచెందెద రర్జునా !

53 నీవుగాంచిన విశ్వమూర్తిని
వేద తప దానముల యాగ
క్రియలచేతను గన నసాధ్యము
భక్తిలేకున్నన్

54 ఇట్టిరూపుడ నన్నెరుంగుట,
గాంచగల్గుట, నైక్యమందుట
అన్యమెరుగని భక్తవరులకె
సాధ్యమౌ పార్థా !

55 మత్పరమ్ముగ కర్మజేసెడి
మత్పరుండును సంగరహితుడు
భూతహితుడౌ పరమభక్తుడు
నన్నె పొందును ఫల్గునా

శ్రీ మద్భగవద్గీతానుధామాధురి - విశ్వరూపసందర్శన
యోగము ఏకాదశాధ్యాయము.

# 12వ అధ్యాయము - భక్తియోగము

అర్జునుడడిగెను :-

1 సతతము నీపై ఒప్పు చిత్తము
సగుణుగా కొందరును కొలుతురు
బ్రహ్మగా కొందరును కొలుతురు
ఎవరు ఘను లనఘా :

భగవానుడు పలికెను :-

2 చిత్తమును నాయందె నిలుపుచు
తదేకాత్మను నిష్ఠపరుడై
శ్రద్ధగా నన్నుపాసించెడి
యోగి శ్రేష్ఠుడు భారతా :
3 అక్షరము నవ్యక్త మచలము
ననిర్దేశ్యము ధ్రువ మచింత్యము
నైన ఈశ్వరు నాత్మ సతతము
ముపాసించెడి సాధులున్
4 ఇంద్రియమ్ముల నిగ్రహించియు
నన్నిటను సమభావగతులై
సర్వ భూతహితై కరతులు
నన్నె పొందుదు రర్జునా :
5 నిర్గుణాత్మోపాసనము బహు
క్లేశకరమై యుండుకతమున
దేహధారుల కవ్యక్తమౌ గతి
కష్టసాధ్యము భారతా :

11 దీనికిన్ దగు శక్తి లేనిచో
శరణు జొచ్చుము నన్నె పార్థా
మదాశ్రియ నియతాత్మడవునై
కర్మఫల మర్పింపుమా !

12 సదభ్యాస జ్ఞాన ధ్యానము
కర్మఫలత్యాగములు తాతా !
ఉత్తరోత్తర ముత్తమమ్ములు
త్యాగ మొసగును శాంతమున్

13 సర్వభూత ద్వేష రహితుడు
స్నేహశీలి దయాస్వభావుడు
మమత్వాహంకారరహితుడు
కష్టసుఖ సముడున్

14 సతత తుష్టుడు యోగయుక్తుడు
నియత చిత్తుడు నిశ్చయాత్ముడు
మదంకిత బుధ్యాత్మభక్తుడు
నాకు ప్రియతము డట్టివా !

15 లోక మెవ్వనివలన భీతిల
దెవడు జగతికి భయమువందడు
భయ క్రోధోద్వేగహర్షవి
దూరు డాతడె భక్తుడౌ

16 శుచియు దక్షుం డుదాసీనుడు
గతవ్యథుడు ననంగకర్ముడు
కామరహితుడు నైన భక్తుడు
నాకు మిక్కిలి యిష్టుడా

17 సుఖము దుఃఖము శుభాశుభములు
ద్వేషకాంక్షలు లేనిభక్తుడు
మదంకిత నిర్మలిన చిత్తుడు
నాకు ప్రియతము డర్జునా!

18 శతృలందును మిత్రులందును
మానమందవ మానమందును
సౌఖ్య దుఃఖములంద నంగుడు
సముడు మత్ప్రియు దర్జునా!

19 స్తుతుల నిందల సముడు మౌనియు
తుష్టుడును ననికేతనుండౌను
నిశ్చలాత్ముడునైన భక్తుడు
నాకు నిష్టుడు భారతా!

20 శ్రద్ధగా మత్పరము మతులై
యిట్టి ధర్మామృతము బాగుగ
నుపాసించెడి వరమ భక్తులె
నాకు ప్రియతము లెప్పుడును

శ్రీ మద్భగవద్గీతా సుధామాధురి - భక్తియోగము
ద్వాదశాధ్యాయము

## 13వ అధ్యాయము - క్షేత్రక్షేత్రజ్ఞవిభాగయోగము

అర్జును డడిగెను :-

1 ప్రకృతి యెయ్యది పురుషు డెవ్వడు
క్షేత్రమును క్షేత్రజ్ఞు లెవ్వరు
జ్ఞానమును జ్ఞేయమ్ము లెయ్యవి
తెలియజెప్పవె కేశవా !

భగవానుడు తెల్పెను :-

2 ఈశరీరమె క్షేత్ర మనియును
తద్విదుడు క్షేత్రజ్ఞ డనియును
జ్ఞానయోగులు చెప్పుచుందురు
తెలియగాదగు ఫల్గునా !

3 సర్వ క్షేత్రములందు భారత
నన్నె క్షేత్రజ్ఞునిగ దెలియుము
క్షేత్రమును క్షేత్రజ్ఞు గూర్చిన
ఎరుకయే సుజ్ఞానమౌ

4 క్షేత్రమును, తజ్జన్మ, ప్రకృతియు
వికారంబులు క్షేత్రవేత్తయు
నతని మహిమల గూర్చు జ్ఞానము
సంగ్రహంబుగ దెల్పెదన్

5 దీని ఋషులు ననేకవిధముల
వేదముల గానంబుజేసిరి
యుక్తియుతముగ బ్రహ్మసూత్రము
లంతు భల్కెరి తవ్వడి !

6 పంచభూతము లింద్రియమ్ములు
మనోబుద్ధులు నహంకారము
నింద్రియార్థము లైదు మూల
ప్రకృతియును పార్థా !

7 కోర్కె ద్వేషము సుఖము దుఃఖము
శరీరేంద్రియసమూహంబును
తెలివి ధైర్య వికారయుత మిది
క్షేత్రమౌ పార్థా !

8 అమానిత్వము నదంభిత్వము
క్షాంత్యహింసార్జవములును శుచి
ధృతులు గురుసేవయును నింద్రియ
నిగ్రహమ్ములు మరియుమన్

9 విషయముల వైరాగ్యమూనుట
నహంకారము లేకయుండుట
జన్మమృతి రుగ్ జరాదుఃఖము
లందు దోషము లరయుటన్

10 ఆలుబిడ్డలు గృహమునందున
మమత తగులములుండకుండుట
ప్రాప్తమైన హితాహితంబుల
సామ్యభావము మానుటన్

11 అనన్యంబయిన సుస్థిరంబగు
మత్పరంబగు భక్తియోగము
విజన సుస్థల వాసనంస్థితి
జనాసంగతియున్

12 నిత్య మాత్మజ్ఞాననిష్ఠయు
తత్త్వదర్శన మిన్ని కలసిన
దదియె జ్ఞానము కాని దజ్ఞా
నమ్మనూ పార్థా :

13 తెలియదగినది బ్రహ్మతత్త్వము
తత్త్వవిదునకె మోక్షమిచ్చును
సదసదాత్మ మనాది బ్రహము
దాని దెల్పెదు భారతా :

14 అంతటను చేతులును కాళ్లును
కండ్లు శిరములు చెవులు ముఖములు
కలిగి జగముల నిండియున్నది
ఆత్మ నిత్యముగన్

15 ఇంద్రియముల గుణపరిణామము
వర్జితేంద్రియ మసక్తమయిన
సర్వభృతమును నిర్గుణమయ్యుం గు
ణానుభవమును బ్రహ్మమౌ

16 భూతబహి రంతరవ్యాప్తము
చరాచర మతిసూక్ష్మమగుటను
ఆత్మ అజ్ఞున కగోచరమది
దవ్వుదాపుల నుండెడిన్

17 ప్రాణులందున నిండియుండియు
కలియన ట్లగపడును బ్రహ్మము
సృష్టియును స్థితియును లయమ్మును
దాన చేయును ఫల్గునా ।

18 సర్వకాంతుల నిందువెలుగై
జ్ఞాన జ్ఞేయ ధ్యేయములు నై
తమోహరమై హృత్స్థితంబై
ఆత్మ యలరారున్ ।

19 క్షేత్రమును జ్ఞానమును జ్ఞేయము
నెరుగబరచితి సంగ్రహంబుగ
దీని దెలియు మదీయ భక్తుడు
నన్ను బొందుట కర్షుడౌ

20 ప్రకృతియును పురుషుండు నుభయు ల
నాదులన్నది యెరుగు మర్జున
త్రిగుణములు మతివికారంబులు
ప్రకృతిభవములు భారతా ।

21 కార్యకారణసంవిధానము
ప్రకృతికృతమని, సుఖము దుఃఖము
ననుభవించుట కిలను హేతువు
పురుషు డని యును నెరుగుమా

22 ప్రకృతిసంస్థితు డగుట జీవుడు
ప్రాకృతములగు గుణములందును
గుణము అంటుటచేత సదసత్
జన్మలను బొందున్.

23 దేహమం దీజీవు డున్నను
అనుమతించెడివాడు సాక్షియు
వరుడు భోక్తయు, భర్త, యీశుడు
బ్రహ్మమే తెలియన్

24 ఇట్టి పురుషుని దెలిసి సగుణ
ప్రకృతిని గ్రహియించు విజ్ఞుడు
మరల జన్మం బెత్తబోవడు
ఎట్టి సాధకుడైనియున్

25 ధ్యానకర్మ జ్ఞానయోగుల
ఆత్మయోగ సునిష్ఠితాత్ముల
ఆత్మసాక్షాత్కారమందుదు
రాత్మమార్గములన్

26 వీని నెరుగనివార లితరుల
వలన దెలిసియు ననుష్ఠింతురు
శ్రుతిపరాయణులయ్యు భవమును
దాటజాలుదు రర్జునా !

27 క్షేత్రమును క్షేత్రజ్ఞు లొండొరు
కూడియుండిన కారణముననె
ఈచరాచరవిశ్వ మంతయు
సృజనమందిన దారయన్

28 దేహములు దహ్యంబులై నను
సర్వజీవులయందు సముడై
యున్న యీశ్వరు నవ్యయునిగా
గాంచు నాతడె జ్ఞానియౌ

29 సర్వజీవులయందు వెలిగెడు
సర్వు సమముగ గాంచు విజ్ఞుడు
తన్ను దా హింసింపజాలడు
గాన మోక్షము పొందెడున్

30 సర్వకర్మలు ప్రకృతిచేతనె
సర్వవిధముల జేయబడునని
ఆత్మ యెప్పుడు కర్త కాదని
తెలియునాతడె జ్ఞానియౌ !

31 వృదగ్భూతవస్తివంత మంతరయు
వాత్మగత మని, యాత్మనుంతియు
వ్యాప్త మగునని యెరుగు జ్ఞానియె
పొందు బ్రహ్మము నర్జునా!

32 అనాదియు నిర్గుణుడు నవ్యయు
డగుట నాత్ముడు దేహియయ్యును
కర్తయును బద్ధుడును గాదని
తెలిసికొనుము ధనంజయా!

33 సర్వగత మాకాశమంటదు
వేనినైనను సూక్ష్మమగుటను
అట్లె దేహము లన్నిటంగల
ఆత్మ నంటవు పెవ్వియున్

34 సూర్యు డొక్కడె లోకమంతయు
ప్రజ్వలింపగ జేయురీతిని
క్షేత్రి దా క్షేత్రముల నన్నిటి
ప్రకాశింపగజేసెడిన్

35 జ్ఞానదృష్టిని యివ్విధంబున
క్షేత్రక్షేత్రజ్ఞాంతరజ్ఞుడు
భూతప్రకృతి మోక్ష విదుడును
నన్నె పొందుడు రర్జునా!

శ్రీమద్భగవద్గీతాసుధామాధురి క్షేత్రక్షేత్రజ్ఞ
విభాగయోగము—త్రయోదశాధ్యాయము

# 14వ అధ్యాయము - గుణత్రియ విభాగయోగము

1 పరమ ఋషులందరును దీనిని
తెలిసి పరమున మోక్షముందిరో
అట్టి పరమోత్కృష్టమగు మ
జ్ఞానమును బోధించెదన్

2 అట్టి జ్ఞానోపాశ్రితాత్ములు
నాదు సారూప్యమును బొందుట
స్వర్గమందుననైన బుట్టరు
వ్యధను చెందరు లయమునన్

3 మహా ప్రకృతి స్వజనక్షేత్రము
అందునే గర్భంబు నుంచుదు
దానినుండి సమస్త భూతము
లుద్భవించును ఫల్గునా!

4 సర్వజాతుల శరీరమ్ములు
మాయయోనిసముత్భవంబులు
నేను తండ్రిగ బీజముంతుదు
ప్రకృతిగర్భమునన్

5 ప్రకృతిజాతగుణమ్ము లగు నీ
సాత్వికము రాజసము తామస
మవ్యయాత్ముని దేహబద్ధుగ
జేయుచున్నని భారతా!

6 అందు సత్త్వము స్వచ్ఛ మగుటను
ప్రకాశమును నిరామయమునై
సత్త్వ సుఖ జ్ఞానకాంక్షల
జీవు జేయు నిబద్ధుగాన్ ।

7 దృశ్య విషయాపేక్ష, సంగము
అరయ రాజసభావములనౌ
రాజసాత్మకకర్మములచే
దేహి బద్ధు డగున్

8 తమోగుణ మజ్ఞానజ మ్మది
మోహకారణ మగుచు జీవుని
మరపు నలసత్వమును నిద్రల
పట్టి బంధించున్

9 సుఖమునందున సత్త్వగుణమును
కర్మమందున రజోగుణమును
జ్ఞానవిస్మృతి దమోగుణమును
జేర్చు జీవుని కవ్వడీ ।

10 సత్త్వబలమున రజస్తమములు
రజశ్శక్తిని సత్త్వతమములు
తమోజృంభణ రజస్సత్త్వము
లణచగాబడు నర్జునా ।

11 దేహమున శ్రోత్రాది కేంద్రియ
ద్వారముల 'ధీ' జ్ఞాన దీధితు
లతిశయించిన సత్త్వ వృద్ధిగ
దెలియఁగాదగు ఫల్గునా !

12 రజోగుణ మభివృద్ధినందిన
లోభమును వాంఛలు నశాంతియు
నాశ, కర్మారంభములు నరు
నాశ్రయించును భారతా !

13 తమోగుణ మధికంబునందిన
బుద్ధి మాంద్యము నప్రవృత్తియు
ప్రమాదము మౌఢ్యంబు లబ్బును
నరున కీఁగతిన్

14 సత్త్వ మతిశయమందునుండగ
మృతిని జెందిన దేహి విజ్ఞా
నాత్ము డందెడి విమలలోకము
నందు నిక్కము ఫల్గునా !

15 రజోవృద్ధిని మరణమందిన
కర్మసంగులయందు బుట్టును
తామసుడుగా మృతుండై నచో
హీనయోనుల బుట్టతిన్

16 సత్త్వ రాజస తామసకృత
కర్మఫలముల సత్త్వ నిర్మల
సౌఖ్యమును, దుఃఖమును, మౌఢ్యము
వరుస గాంతురు క్రమమునన్

17 సత్త్వమున జ్ఞానంబు కల్గును
రాజసంబున లోభముద్భవము
తమమునం దజ్ఞానమును మో
హము ప్రమాదము లబ్బెడిన్

18 ఊర్ధ్వలోకమ్ముల సత్త్వులు
మనుజలోకము రాజసాత్ములు
నీచగుణ తామసు లధోగతి
బొందుచుందురు ఫల్గునా !

19 గుణములనుగా కొరుని కర్తగ
నెన్న బోవక జ్ఞానఘనుడై
నన్ను గుణముల కతీతునిగా
దెలియునాతడె ముక్తుడా !

20 దేహకారణగుణత్రయమును
మించి జననము మృతియు జరయును
దుఃఖమును వర్జించు జీవుడు
శాశ్వతాత్ముడు భారతా !

అర్జునుడడిగెను :-

21 గుణాతీత విశుద్ధచిత్తుని
లక్షణములును వర్తనంబులు
గుణాతిక్రమణార్థసాధన
దెలియజెప్పుము మాధవా !

భగవానుడుచెప్పెను :-

22 త్రిగుణకార్యము కాన సుఖమును
కర్మవృత్తియు మోహ మనునవి
అందు ద్వేషము, కాంక్ష పూనక
వచ్చిపోయెడువానికై

23 సాక్షిమాత్రుడుగా మెలంగుచు
త్రిగుణచలితుడుగాక ప్రాకృత
గుణములే వర్తించు నెరిగియు
నిశ్చలత నుండున్

24 మన్ను పాషాణంబు స్వర్ణము
సుఖము దుఃఖము, స్తుతియు నిందయు
ప్రియాప్రియములయందు సముడై
యనుభవించును ధీరుడౌ

25 మానమవమానముల సముడును
శత్రుమిత్రులయందు తుల్యుడు
కామ్యకర్మాచరణ విముఖుడు
గుణాతీతుడు పాండవా !

26 నన్ను చంచల భక్తియోగము
చేసియారాధనము చేసిన
గుణావరణము దాటి బ్రహ్మము
దానయగుటకు నరుడౌ !

27 నాశరహితుడ నిర్వికారుడ
శాశ్వతాత్ముడ ధర్మరూపుడ
నిరతిశయ సుఖవిధి విధాతను
నేనెనుమ్ము ధనంజయా !

శ్రీ మద్భగవద్గీతా సుధామాధురి - గుణత్రియవిభాగ
యోగము చతుర్దశాధ్యాయము



# 15వ అధ్యాయము-పురుషోత్తమప్రాప్తియోగము

భగవానుడు పల్కెను :-

1 ఊర్ధ్వమూలము నధశ్శాఖము
వేదపర్ణము భవాశ్వత్థము
నవ్యయము నని తెలియుప్రాజ్ఞుడు
వేదవిద్వరు డర్జునా !

2 త్రిగుణవృద్ధిని విషయపుంజగు
రాకు శాఖలు-కర్మబంధము
లగుచు వేళ్ళులు-వ్యాప్తిగాంచెను
క్రిందు మీదుగ భారతా !

3 భవాశ్వత్థపు స్వరూపంబును
నాది మధ్యాంతములు నగపడ
వైన దృఢమూలమును వైరా
గ్యాసిచే దునుమం దగున్

4 దాన నందిన పరమపదమును
వీడి మరలడు తత్ప్రవృత్తికి
నాద్యునాత్ముని "నీవె శరణని"
వెదుకగావలె భక్తిమై

5 మోహమభిమానమును సంగపు
దోషమును కామమును సుఖదుః
ఖాది ద్వంద్వము లన్ని వీడిన
బ్రహ్మవిజ్ఞులు నవ్యయం బగు
మోక్షమందుదు రర్జునా !

6 రవియు చంద్రుడు వగ్ని వెలుగని
స్వప్రకాశము పరంధామము
దాని పొందిన మరలరెవ్వరు
పరమపద మది ఫల్గునా !

7 నిత్యమౌ నాయంశ జగమున
జీవరూపమునంది ప్రకృతి
స్థముల నింద్రియములను బలిమిని
కర్షణము చేయున్

8 పూలతోటల పరిమళములను
మారుతము గ్రహియించునట్టుల
పొందిదేహము విడుచుపట్టున
జీవి వాసనలంది యేగును
తెలియు మిది పార్థా !

9 చెవులు కన్నులు ముక్కు నాలుక
చర్మ మను జ్ఞానేంద్రియమ్ములు
మనసు కలిసియు విషయసుఖముల
ననుభవించును ఫల్గునా !

10 దేహి దేహము వీడినపుడును
దేహమున గుణసంయుతుండై
విషయసుఖముల నందినపుడును
నాత్మనే యని మూఢు లెరుగరు
జ్ఞానులకు దెలియున్

11 యత్నపరు లగు యోగు లాత్మని
హృదయమందే గాంతు రర్జున
శుద్ధ చేతము లేమి మూఢులు
గానజాలరు కవ్వడీ ।

12 జగద్భా సాదిత్యతేజము
చంద్రికాంతియు నగ్నిదీప్తియు
నై వెలింగెడి ప్రకాశం బది
యస్మదీయం బెరుగుమా ।

13 నేనె భూమికి శక్తి నగుదును
జీవజగతి భరించుచుందును
చంద్రునిగ నాయమృతాంశుల
పెంతు నోషధులన్

14 దేహముల వైశ్వానరాగ్నిగ
వెలసి ప్రాణాపానసంగతి
నాల్గురకముల యోగిరముల
బచన మొనరింతున్

15 జీవులందుననుండి వారికి
స్మృతియు జ్ఞాన మపోహ లొనగుదు
వేదవేత్తను వేదకర్తను
వేదవిదుఁడను భారతా ।

16 లోకమందున పురుషు లిద్దరు
క్షరుడు నక్షరు డందు క్షరు డన
భూతజాలము, నక్షరుడు కూ
టస్థు డనబరగున్

17 త్రిలోకంబుల జేరి భారము
మోయునవ్యయు బరుని నన్నీల
నీశ్వరుడు పురుషోత్తముడు పర
మాత్ము డందురు భారతా !

18 క్షరాక్షరులకు నతీతుండను
దాన వేదములందు జగముల
బురుషోత్తము డను ప్రసిద్ధిని
గాంచినాడను కవ్వడీ !

19 నరుడు విజ్ఞత బురుషోత్తము
నన్నెరుంగుచు సర్వవిదుడై
చిత్తశుద్ధిగ నన్నివిధముల
నన్భజించిన ముక్తుడౌ

20 ఈరహస్యంబైన శాస్త్రము
నీకు విశదముగాగ దెల్పితి
నెరుకగాంచిన జ్ఞానము డిల
కృతార్థుం డగు నర్జునా !

శ్రీమద్భగవద్గీతాసుధామాధురి – పురుషోత్తమ
ప్రాప్తి యోగము పంచదశాధ్యాయము.

# 16వ అధ్యాయము - దైవాసురసంపద్విభాగ యోగము

1 అభయ మంతఃకరణశుద్ధియు
జ్ఞానయోగమునందు నునికియు
తపస్స్వాధ్యాయార్జవమ్ములు
దానయజ్ఞదమమ్ములున్

2 అహింసయు సత్యమక్రోధము
త్యాగమును శాంతియు నపైశునము
భూతదయ మార్దవము స్థైర్యము
నలోలత్వము వినయమున్

3 తేజ మోర్పును ధృతియు శౌర్యము
ద్రోహగర్వవిదూరత్త్వము
దైవసంపదతోడ బుట్టిన
వాని సుగుణంబుల్

4 దంభమును దర్పము నహంకృతి
క్రోధ పరుషాజ్ఞానగుణములు
అసురసంపదతోడ బుట్టిన
వాని నైజంబుల్

5 దైవసంపద మోక్షమొసగును
అసురసంపద బంధహేతువు
దివ్యగుణముల బుట్టినాడవు
దిగులు చెందకు మర్జునా !

6 లోకమందున దైవ మాసుర
మనెడి ద్వివిధపు సృష్టు లున్నవి
దైవసంపదవిధము దెలిపితి
నాసురము వినుమా !

7 ఇల ప్రవృత్తి నివృత్తిమార్గము
లున్నవనియే యెరుగ రసురులు
శౌచమును సదవర్తియు సత్యము
వారలందున మృగ్యముల్

8 జగ మసత్యము సప్రతిష్ఠము
కామహేతుక మనీశ్వరము మ
స్త్రీపురుషసంబంధజాతము
నందు రసురులు పల్గునా

9 నాస్తికులు నష్టాత్ములల్పులు
క్రూరకర్ములు నహితకరులును
లోకముల నాశనముజేయగ
పుట్టుచుందురు నసురులై

10 తనివితీరని కామరతులై
దంభమానమదాన్వితులునై
మోహచలమున నీచవృత్తులై
ప్రవర్తింతురు నాసురుల్

11 మరణపర్యంతమ్ము నమితపు
నాశలకు లోనైన వారై
కామభోగము లనుభవించుట
ధ్యేయ మందురు నాసురుల్

12 అనంతాశాపాశబద్ధులు
కామ క్రోధాధీనమతులై
కామభోగార్ధమ్ము నన్యా
యార్థసంగ్రహు లాసురుల్

13 ఇప్పు డీకోరికను బొందితి
ముందు ముందును బొందగల్గుదు
నాది యీధన మింతకంటెను
నెక్కు డార్జింతున్

14 శత్రు జంపితి దక్కవైరుల
గూడ జంపుదు నీశ్వరుండను
నేనె భోగిని కార్యసిద్ధుడ
బలుడ సుఖి నౌదున్

15 నేను ధనికుడ నభిజనుండను
నసదృశుండను యాగదానము
లాచరించి సుఖమ్ము నందెద
నని దలంచును మూఢుడై

16 చపలచిత్తుడు మోహితాత్ముడు
కామభోగాసక్తు డవని
భ్రాంత రంగుడు నసురభావుడు
నరకమున బడు నర్జునా !

17 ఆత్మస్తుతి పరులలును లార్జిత
ధనము మానము మదము కలిమిని
దాంభికస్థితి నవిధపూర్వక
నామమాత్రపు యజ్ఞకర్మల
నాచరింతురు రక్కసుల్

18 అహంకారము బలము దర్పము
కామమును క్రోధము నసూయయు
కలిగి తనయం దితరులందున
నాత్మ గాంచరు ఫల్గునా !

19 ఆత్మద్వేషుల క్రూరకర్ముల
నధములను నీచులను సంసా
రంబునన్ గడు హీనజన్మల
నొందజేయుదు నెప్పుడున్

20 జన్మజన్మల మూఢమానవు
లసురయోనుల బుట్టి గిట్టుచు
నన్ను బొందగలేక గాంతురు
హీనదుస్థితులన్

21 కామమును క్రోధమ్ము లోభము
తనను నాశముఁజేయు నరకపు
ద్వారములుగా నెరిగి మూటిని
విడువగావలె నర్జునా !

22 నారక ద్వారములు కామ
క్రోధలోభాదులను వీడియు
నరుడు మేలగు యోగసాధన
జేసి గాంచును మోక్షమున్

23 శాస్త్ర పద్ధతు లుల్లగించుచు
నిచ్చవచ్చినరీతి వర్తిలు
నరుడు సిద్ధియు సుఖము మోక్షము
నందజాలడు భారతా !

24 కాన కార్యము నకార్యంబును
దెలియ శాస్త్రమె ప్రమాణం బగు
శాస్త్రచోదితకర్మ జేయగ
దగుఁదు వీవె ధనంజయా !

శ్రీ సద్భగవద్గీతాసుధామాధురి - దైవాసుర సంపద్వి
భాగయోగము - షోడశాధ్యాయము

# 17వ అధ్యాయము - శ్రద్ధాత్రయవిభాగయోగము

అర్జునుడు పల్కెను :-

1 శాస్త్రవిధులను మఱిగించుచు
శ్రద్ధ నర్చనచేయు నరుస్థితి
సత్త్వ రాజస తామసంబుల
నేది శ్రీకృష్ణా :

భగవానుడు పల్కెను :-

2 దేహధారుల స్వభావాశ్రిత
శ్రద్ధ త్రివిధము సత్యహరి
సాత్త్వికమ్మును రాజసమ్మును
తామస మ్మనగన్

3 పూర్వభవ సంస్కారయుతమౌ
చిత్తవృత్తిని శ్రద్ధ గల్గును
శ్రద్ధయే యీపురుషు డాతని
స్వభావం బది ఫల్గునా :

4 దేవతాళిని సత్త్వచిత్తులు
యక్షదైత్యుల రాజసాత్ములు
ప్రేతభూతగణమ్ములను తా
మసులు గొల్తురు కవ్వడీ :

5 దంభసహితాహంకృతాత్ములు
కామరాగబలాన్వితాత్ములు
నశాస్త్రీయపు టుగ్రతపముల
నాచరింతురు రాక్షసుల్

6 దేహమందలి భూతజాలము
శరీరాంతరవర్తి నన్నును
ఘోరతపముల నృక్కృతియుతు
రజ్ఞులై యసురుల్.

7 అన్నమును త్రివిధాత్మకమ్ముగ
యజ్ఞ దాన తపమ్ములున్నటు
ప్రీతిగొల్పును త్రివిధగుణముల
వాని భేదము నెరుగుమా!

8 ఆయురారోగ్యములు సత్త్వము
బలము సుఖమును ప్రీతి గూర్పెడి
రసము తైలము స్థిరము హృద్యము
లైన యాహారములు సాత్త్విక
ప్రియుల కిష్టంబుల్

9 దుఃఖ రోగ విదాహ హేతువు
చేదు పులుపును నుప్పు కారము
రూక్షమును నత్యుష్ణమన్నము
రాజసుల కిల ప్రీతియౌ

10 అపక్వంబును రసవిహీనము
పూతియును పాచినది యెంగిలి
యశుద్ధంబును నైన యన్నము
తామసుల కిల నిష్టమౌ

11 చేయదగు నని చిత్తమొప్పిన
శాస్త్రవిహితము ఫలముకోరక
చేయుయజ్ఞము సాత్త్వికమ్మని
జ్ఞాను లందరు తారకా :

12 ఫలమునందలి వాంఛచేతను
దాంభికమ్మగు కీర్తికొఱకై
చేయు యజ్ఞము రాజసమ్మని
యెరుగు మాత్మను ఫల్గునా :

13 విధివిహీనము నసృష్టాన్నము
మంత్రరహితము నదక్షిణమును
శ్రద్ధశూన్యము నైన యాగము
తామసం బగు నర్జునా :

14 దేవగురు విప్రార్యపూజయు
బ్రహ్మచర్యార్జవాహింసలు
బాహ్యమభ్యంతరము శౌచము
దేహతపములు కవ్వడీ :

15 అనుద్వేగకరమ్ము ప్రియమును
సత్యమును హితమైన వాక్యము
వేదశాస్త్రాధ్యయన మనునవి
వాక్తపం బని పాండవా :

16 మనోనైర్మల్యమ్ము సౌమ్యము
మౌన మాత్మవినిగ్రహంబును
భావసంశుద్ధియును నియ్యవి
మనోతపములు ఫల్గునా !

17 అఫలకాంక్షులు నిశ్చలాత్ములు
శక్తి శ్రద్ధల జేయు తపములు
మనోవాక్కాయముల త్రివిధము
లిలను సాత్త్వికముల్

18 పూజ గౌరవపురస్కారము
లందుకొనుటకు డాంబికంబుగ
జేయు నస్థిర మనిశ్చిత మౌ
తపము రాజస మర్జునా !

19 మొండిపట్టున నాత్మపీడా
కరంబయ్యును నన్యనాశము
గోరి చేసెడి తపం బయ్యది
తామసము పార్థా !

20 దేశమును కాలమ్ము పాత్రయు
నెఱిగి యర్హమ్మైన దానము
దిరిగి యుపకృతి జేయజాలని
వరవ కొసగుట సత్త్వనిష్ఠ

21 ప్రతిఫలమ్మును ప్రత్యుపకృతియు
గోరి మనుజుడు క్లేశమతియై
చేయు దానము రాజస మ్మని
బుధులు పల్కుదు రర్జునా ॥

22 అసత్కృతమును నవజ్ఞాతము
దేశకాల మనర్హపాత్రము
నైన దానము తామస మ్మని
ఆర్యు లందురు భారతా ॥

23 ఓమ్ తత్ సత్ నాగబ్రహ్మము
త్రివిధరీతుల జెప్పబడియెను
విప్రవేదాధ్వరము లాదిని
సృజింపంబడె వానిచేత్

24 వేదవేత్తలు విధివిహితములు
యజ్ఞ దాన తపమ్ము లాదిని
ప్రణవ మగు నోంకృతిని పల్కుచు
మొదలుపెట్టెద రర్జునా ॥

25 ఫలముగోరక ముముక్షువు లిల
'తత్' పదోచ్చారణముతన్ బహు
యజ్ఞ దాన తపఃక్రియల్ ఘని
సల్పుచుందురు ఫల్గునా ॥

26 'సత్' పదమ్మును 'కలదు' 'మంచిది'
యనెడి యర్థము లందువన్ మరి
శుభవ్రద మగు కర్మలందున
బ్రయోగింతురు కవ్యదీ !

27 యజ్ఞ దాన తపస్సులందలి
స్థితిని 'సత్తు' ని పల్కుచుందురు
ఇల తదర్థకకర్మ సైతము
సత్తనంబడు పాండవా !

28 యజ్ఞ దాన తపస్సులన్ మది
శ్రద్ధలేకయె నరుడు చేసిన
నసత్తందురు ఇహపరంబుల
చెరచు నయ్యది ఫల్గునా !

శ్రీ మద్భగవద్గీతాసుధామాధురి - శ్రద్ధాత్రియవిభాగ
యోగము సప్తదశాధ్యాయము



# 18వ అధ్యాయము - మోక్షసన్న్యాసయోగము

అర్జునుడడిగెను :-

1 కేశిసంహర ! హృషీకేశా !
సన్న్యాసంబును త్యాగ మను నీ
రెంటితత్త్వము వేరువేరుగ
దెలియ జెప్పవె వేడెదన్

భగవానుడు చెప్పెను :-

2 కామ్యకర్మత్యాగమును సం
న్యాసమందురు బుధులు కొందరు
సర్వకర్మలఫలము వీడుట
త్యాగ మందురు కొందరున్

3 కర్మ దోషయుతంబు కావున
వదలవలె నని కొంద రందురు
యజ్ఞ దాన తపాదికర్మల
త్యాగ మొవ్వరు కొందరున్

4 కర్మవర్జనవిషయమున నా
నిర్ణయంబును వినుము శ్రద్ధగ
కర్మత్యాగము మువ్విధము లని
చెప్పబడినది భారతా !

5 యజ్ఞ దాన తపంబు లర్జున
మనీషుల కతిపావనంబులు
వట్టి యాగాదులను విడక
యనుష్ఠించుట యుక్తమౌ

6 యజ్ఞ దాన తపస్సు లనునవి
సంగఫలకాంక్షలను విడిచియు
చేయుటయె యుత్తమము యుక్తము
నిశ్చయంబుగ ఫల్గునా॥

7 విహిత కర్మల విడుచు టెన్నడు
తగదు అజ్ఞానమున వదలుట
తామసత్యాగమ్ముగ నెంతురు
బుధులు కౌంతేయా

8 శ్రమము ఖేదము కల్గునంచిల
కర్మ మానిన త్యాగఫలమును
పొందనేరడు వట్టి త్యాగము
రాజస మ్మనఘా॥

9 తనకు కర్తవ్యమ్ము విహితము
నైన కర్మల సంగమును ఫల
కాంక్ష వీడియు చేయుచో నది
సాత్త్వికమ్మగు త్యాగమా॥

10 సాత్త్వికుడు మేధావి సంశయ
రహితు డగు త్యాగియ్యు నకుశల
కర్మముల ద్వేషమ్ము కుశలము
నంద డెన్నడు ఫల్గునా॥

11 దేహి సంపూర్ణముగ గర్మల
వీడు టయ్యది యశక్యంబౌ
కాన కర్మల ననుష్ఠింపుచు
ఫలము వదలిన త్యాగివౌ ॥

12 కర్మఫల మది హితము నహితము
మిశ్రమం బని త్రివిధ మర్జున
చనినపిమ్మట జీవి పొందును
త్యాగి నంటవు వానవల్

13 కర్మకాండము చెప్పు సాంఖ్యులు
కర్మఫలహేతువులు నైదును
దెల్పినారలు వాని నిక్కడ
వినుము శ్రద్ధగ నర్జునా ॥

14 కర్త, దేహము, నింద్రియమ్ములు
వివిధములు నా ప్రాణకర్మలు
దైవమును నీకర్మఫలమునకు
కారణమ్ములు ఫల్గునా ॥

15 ధర్మమైన నధర్మమైనను
వాఙ్మనోదేహముల మనుజుడు
చేయు కర్మకు కారణములి
యైదుసుము పార్థా ॥

16 కారణము లిటు నైదుండగ
దుష్టబుద్ధియు కుసంస్కారుడు
కర్మతత్త్వం తెరుగజాలక
తాను కర్తగ నెంచెడిన్ ।

17 కర్తృకర్మవిమోహదూరుడు
సర్వజీవుల జంపినను దా
కర్మబద్ధుడు కాడు కావున
హంత పాపియు గాడిలన్

18 జ్ఞాత జ్ఞేయము జ్ఞాన మనునవి
కర్మచోదకకారణమ్ములు
కర్త కరణము కర్మ మూడును
కర్మసంగ్రహముల్

19 కర్త కర్మ జ్ఞానములు గుణ
భేదమున త్రివిధంబు లని గుణ
సాంఖ్యతత్త్వము చెప్పబడినది
యదార్థమ్ముగ నెరుగుమా ।

20 భిన్నములగు సర్వజీవుల
యం దభిన్నము నేక మవ్యయ
మైన యాత్మను గాంచు జ్ఞానము
సాత్త్వికం బది తెలువా !

21 భిన్న దృష్టిని సర్వప్రాణుల
భిన్నములుగా జూచి వేరని
యెంచు జ్ఞానము రాజసం బని
తెలియగాదగు నర్జునా ॥

22 అసత్యమ్ము నకారణమ్మును
తుచ్ఛమును నత్యల్ప ఫలదము
నై యదియె సర్వస్వ మనుకొను
జ్ఞాన మది తామసమురా ॥

23 సంగమును ఫలకాంక్షయును నభి
మానమును రాగమును ద్వేషము
లేని నియత విశిష్టకర్మలు
సాత్త్వికమ్ములు ఫల్గునా ॥

24 అహంకారము ఫలాపేక్షయు
కలిగి యధికాయాస కరముగ
చేయు కర్మలు రాజస మ్మని
ఆర్యు లందురు భారతా ॥

25 దాన గలిగెడు వ్యథయు నాశము
హింసలను తనశక్తి నెంచక
మూఢమతియై చేయు కర్మలు
తామసమ్ములు కవ్వడీ ॥..

26 ముక్తసంగుడు నిరభిమానియు
జయము నపజయ మాత్మ నెంచక
ధైర్య ముత్సాహముల జేసెడి
కర్త సాత్త్వికు డిద్ధరన్

27 కర్మఫలకాంక్షి గాను రాగియు
లోభి హింసాత్ముడు నశుచియును
హర్షశోకసమన్వితుడు నగు
కర్త రాజసు డర్జునా!

28 అయుక్తుడు ప్రాకృతుడు ధూర్తుడు
శఠుడు నలసుడు నైష్కృతుండును
దీర్ఘసూత్రియు విషాదియు నగు
కర్త తామసు డనబడున్

29 బుద్ధి ధైర్యము గుణాత్మకముగ
మువ్విధంబులు వేరువేరుగ
దెల్పెదను సాకల్యముగ నవి
వినుము శ్రద్ధగ పాండవా

30 ప్రవృత్తియు నివృత్తియు కృత్యము
నకృత్యములును భయాభయములు
బంధమోక్షము లన్ని తెలిసిన
బుద్ధి సాత్త్విక మనబడున్

31 ఇలను ధర్మాధర్మ విషయము
కృత్య మకృత్యములను సత్తి
యదార్థమ్ముగ దెలియజాలని
బుద్ధి రాజస మర్జునా !

32 తెలివి నవివేకమ్ము గప్పగ
నధర్మమ్మును ధర్మముగ స
ర్వమును విపరీతముగ దలచెడు
బుద్ధి తామసమౌ నఘా !

33 యోగసిద్ధిని వదలధృతిచే
మనఃప్రాణేంద్రియక్రియలను
నాత్మ ధారణ నుంచు ధైర్యము
సాత్త్వికమ్మగు ఫల్గుణా !

34 ఫలాపేక్షయు [illegible]
ధర్మ మర్థము కామములను నిల
ననుష్ఠింపగ జేయు ధైర్యము
రాజసమ్మగు భారతా !

35 మనుజు డెవ్వాడు దుష్టబుద్ధిగ
నిద్ర భయము [illegible]
[illegible] జేయు ధైర్యము
తామసమ్ము ధనంజయా !

36 దేని యభ్యాసమున జీవుడు
సుఖప్రాప్తియు శోకనాశము
బొందునో యాసుఖము త్రివిధము
దెలియజెప్పెద నెఱుగుమా !

37 తొలుత విష మను భ్రాంతి గూర్చియు
తుదకు నమృతమ్మగుచు నాసిలు
నాత్మరమణమువలన కలిగెడి
సుఖము సాత్త్విక మర్జునా !

38 ఇంద్రియాత్మక విషయసుఖ మిల
మొదట నమృతసదృశముసుం దుద
విషమునై సతతంబు గాల్చును
అద్ది రాజససుఖమువో

39 ఆది నంత్యమునందు నాత్మను
మోహపుచ్చుచు నిద్ర యాలసత
ప్రమాదమ్ముల గూర్చు సౌఖ్యము
తామస మ్మగు నర్జునా !

40 ప్రకృతిజన్యములై త్రిగుణము
లకు నిబద్ధము కాని వస్తువు
భూమి దివి నాకములనైన నట
లేదు వెదకిన [illegible].

41 ద్విజ క్షత్రియ వైశ్య శూద్రుల
వారివారి స్వభావగుణముల
ననుసరించియె కర్మవిభజన
చేయబడియె పరంతపా ।

42 శమము దమమును తపము శౌచము
నోర్పు సద్వర్తనము భక్తియు
జ్ఞాన విజ్ఞానాది కర్మలు
ద్విజుల కర్మము అర్జునా ।

43 శౌర్యమును పౌరుషము ధైర్యము
దక్షతయు యుద్ధమున స్థైర్యము
పాలనను సామర్థ్య మీవియు
క్షత్రియోచితకర్మముల్

44 కృషియు గోరక్షణము వర్తక
మవని వైశ్యస్వభావకర్మలు
పరిచారాత్మ కృషిత కర్మలు
శూద్రసహజము అర్జునా ।

45 స్వభావాత్మక కర్మరతుడై
నరుడు సిద్ధిని గాంచు నర్జున
స్వీయకర్మాసక్తు డేగతి
సిద్ధి బొందునొ తెలియుమా

46 లోకమును సృజియించి పెంచెడి
పరమపురుషుని మహితకర్మల
పూజ సల్పుచునుండు మనుజులు
సిద్ధిగాంతురు ఫల్గునా!

47 సులువుగా దా ననుష్ఠించెడి
పరుల ధర్మముకన్న శ్రమకర
మయ్యు స్వీయమె మేలు దానను
సరుడు పొందడు పాపమున్

48 అగ్ని గప్పిన ధూమమట్టుల
గప్పె దోషము లన్నికర్మల
గాన దోషాస్పదములైనను
వీడరాదు స్వధర్మముల్

49 సంగరహితుడు వీతరాగుడు
జితాత్ముడు నైష్కర్మ్యసిద్ధిచె
మహితకర్మాతీతపదమును
పొందు నిర్మలుడై

50 అర్జునా నైష్కర్మ్య సిద్ధిని
ఎటుల నాత్మను పొందగలడో
అట్టి పరమగు జ్ఞాననిష్ఠను
సంగ్రహించెద దెలియుమా!

51 విశుద్ధుం డగుబుద్ధిమంతుండు
ధీరతను మతి నిగ్రహించియు
శబ్ద మాదిగ విషయదూరుడు
ద్వేషరాగవిముక్తుడున్

52 విజనవాసము మితాహారము
మనోవాక్కాయముల నియమము
సతతవై రాగ్యశ్రియమున్నను
పూను ధ్యానమునందు శ్రీడున్

53 కావరంబును బలము దర్పము
కామక్రోధమమత్వముల నిల
విడచు శాంతుడు బ్రహ్మరూపము
నందుటకు దా నర్హుడౌ

54 బ్రహ్మభూత ప్రసన్నచిత్తుడు
కోరదెద్దియు శోక మొందడు
సర్వభూతములందు సముడై
నాదు భక్తిని వరలెడిన్ :-

55 నాస్వరూపము పొందు తత్త్వము
భక్తివలనను తెలియగా నగు
యదార్థంబుగ నన్నెరింగిన
నన్నె పొందును జ్ఞానియై

56 సర్వకర్మలు జేయుచుండియు
ఆత్మనిష్ఠుడు నాదుకరుణను
శాశ్వతంబును నక్షయంబగు
మోక్షపదవిని పొందెడిన్

57 సర్వకర్మలు నాకొసంగుచు
పరమగతిగా నన్నె నమ్ముచు
ధ్యానయోగమునంది సతతము
నన్నెగాంచుము భారతా!

58 నీదు మతి నాయందె నిల్పిన
నాదయన్ కష్టములు గడచెదు
వన్నహంకారమున వినవిచో
నాశ మందెద వర్జునా!

59 అహంకారము మాని, యుద్ధము
జేయునందువ నదియు వ్యర్థము
నీ స్వభావమె యుద్ధమును
నీచేత జేయించున్

60 అజ్ఞతను నీవొప్పుడున్నను
స్వభావాత్మకస్వధర్మమునకు
కట్టుబడి పరవశత జేయుదు
వదియె ధర్మంబున్!

61 సర్వభూతహృదాలయస్థితు
డీశ్వరుడు తన మాయాచేతను
ప్రాణికోటుల కీలుబొమ్మల
లీల నాడించున్

62 సర్వవిధముల నీశ్వరుని శర
ణమ్ము నందుము వానికృపచే
పరమశాంతిని మోక్షపదవిని
పొందగాగల మర్జునా !

63 అతిరహస్యంబైన జ్ఞానము
చెప్పినాడను వింటిగాదే
దాని బాగుగ నరసి చేయుము
ఇష్టమగురీతిన్

64 మిగుల నాత్మీయుడవు కావున
నమితగుహ్యతమంబు వాక్యము
చెప్పెదను నీహితముగోరుచు
శ్రద్ధగా విను మర్జునా !

65 మనసు నాయందుంచి భక్తిని
పూజ చేసి నమస్కరింపుము
హితుడ వౌట బ్రతిజ్ఞ జెప్పెద
నన్నె పొందెదు నిజముగాన్

66 ధర్మములనన్నిటిని వాకై
వీడి నన్నే శరణు పొందుము
సర్వపాపవిముక్తి జేసెద
దుఃఖమందకు పాండవా

67 భక్తి తపమును గురులసేవయు
నిష్ఠయును లేనట్టి నరులకు
నన్నుదూషణ చేయువారికి
చెప్పరా దీగీతలన్

68 అతిరహస్యంబైన గీతా
శాస్త్రమును నాభక్తవరులకు
జెప్పు విజ్ఞుడు జ్ఞానభక్తిని
పొందు నను సత్యంబుగన్

69 అట్టి మనుజుని కన్నవా రిల
ప్రియము గూర్చగ వేరరెవ్వరు
అతనికన్నను నాకు ప్రియతము
లౌరులులే రిల ఫల్గునా

70 ధర్మయోగంబైన మనమిం
వాద మధ్యయనమ్ము జేసిన
బుధుడు జ్ఞానాధ్వరమునచే నను
జేరి కొలుచు పవిత్రమై

71 శ్రద్ధగా ననసూయమతులై
గీత చదివిన విన్న మనుజుం
డెల్ల యఘముల బాసి పుణ్యుడు
పొందు లోకము లందెడిన్

72 అర్జునా యేకాగ్రబుద్ధిని
గీత సర్వము వింటివా ? యు
జ్ఞానజమ్మగు మోహ మంతయు
శాశ్వతమ్ముగ బోయెనా ?

అర్జునుడుచెప్పెను :-

73 నీయనుగ్రహకారణమ్మున
మోహనాశన మయ్యె నా
శంక వీడితి జ్ఞాన మందితి
చేతునీ యాజ్ఞన్

సంజయుడు పలికెను :-

74 అద్భుతము పులకాంకురోద్భవద
మైన కృష్ణార్జునుల భాషణ
మింపుమీర వినంగనోచితి
దైవకృపచేతన్

75 పరమగుహ్యతమంబు యోగము
స్వయము యోగేశ్వరుడు కృష్ణుడు
పార్థునకు బోధించుచుండగ
వింటి వ్యాసుని సత్కృపన్

76 పావనము సద్భుతము నగు శ్రీ
కృష్ణవిజయుల భాషణము మది
క్షణము క్షణము స్మరించుచును నా
నంద మందెద వరవరా ।

77 కృష్ణు నద్భుత విశ్వరూపము
మాటిమాటికి మరల మరలను
సంస్మరించుచు ధ్యానమున నా
నంద మందెద భూవరా

78 ఎచట యోగీశ్వరుడు కృష్ణుడు
ధనుర్ధరు డగు నరుడు నుందురొ
శ్రీయు విజయవిభూతి నీతులు
నచట నుండును స్థిరముగాన్''

అసతోమాసద్గమయ - తమసోమాజ్యోతిర్గమయ
మృత్యోర్మా అమృతంగమయ
ఓమ్ శాంతిః శాంతిః శాంతిః

శ్రీ భగవద్గీతాసుధామాధురి - మోక్షసన్న్యాసయోగము
అష్టాదశాధ్యాయము

